శ్రీ

# ముద్రిక

ఆఱంకముల నాటకము

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులవారిచే

రచియింపఁబడినది.

మొదటి కూర్పు



రాజమహేంద్రవరము.

డి. వి. రమణారావుగారిచే

శ్రీ విద్యానిలయముద్రాక్షరశాల సమ్ముద్రితము

1923

 [వెల 10 అ

# పీ ఠి క.

ఇది నాపదునాలుగవనాటకము. శ్రీపీఠికాపురపు మహారాజా వారగు మ. రా. రా. శ్రీ. శ్రీరావు వేంకటకుమారమహీపతిసూర్య రావుబహద్దరుగారి ధనసాహాయ్యమున దీని నచ్చువేయించితిని. భాషాపోషకులగు మామహారాజావారికి వారికుటుంబమునకు సర్వేశ్వరుఁడు సకలశ్రేయములనిచ్చి రక్షించుఁగాక.

వా॥ ల. నరసింహారావు.

## ఇందు వచ్చు పాత్రములు.

సేతుమాధవుఁడు—కనకపురరాజు.

మాఘుఁడు—రాజు వేఁడుక చెలికాఁడు.

మాధవుఁడు—శ్రీపురరాజు సేవకుఁడు.

ఇందుమతి—కనకపురరాజ్ఞి.

సుందరి—ఆమెదాసి.

మానవతి—ఇందుమతి చెల్లెలు.

సంపంగి—మానవతి దాసి.

శ్రీరామా.

# ముద్రిక



---

## ప్రథమాంకము.

---

ప్రదేశము—కనకపురపు రాణి యంతఃపురము.

ప్రవేశము—రాణి, ఇందుమతి, దాసి, సుందరి.

ఇందు—సుందరీ! ఈసారి కొంత కఱకుఁదనము వహించి యల్లరిచేసినఁగాని దారికివచ్చునట్లు లేదు.

సుంద—అమ్మా! ఇందుమతీ! ఈమాటలేల? మీవలననగునని నే ననుకొనను.

ఇందు—ఆ! కాకపోవునా? చూతువు కాని—

సుంద—నేను జూచునదేమి? మీరు చూచిచూడనట్లయిన నుండవలయును; కాదేని చేతనైనయెడలఁ గట్టుదిట్టమైన పనియైనఁ జేయవలయును. అందులకు సహనశక్తి లేదయ్యెను. ఇందులకు సాహసము లేదయ్యెను.

ఇందు—సుందరీ! సహనశక్తి లేకపోవుటకాదు. ఎంతసహనశక్తి లేనిచో యింతకాలము తటస్థముగ నుందునా? కాని, యదియిప్పుడు తగ్గుచున్నది. తగ్గదా? ఈసారి యాతఁడు తెచ్చినదానిని విద్యుక్తముగా వివాహమాడునఁట!

సుంద—ఆడఁడా? అమ్మగారి యశక్తతనుజూచి యయ్యగా రెన్నియాటలనాడిన నాడును. ఆతని తప్పేమున్నది? ఒక్క [illegible] నోరుమాలినసతికి నీతిమాలినపతి తప్పఁడు.

ఇందు—క్రిందటిసారి కంచినుండి వైష్ణవిని దెచ్చినప్పుడు— నీవు లేవు కాని — నీయక్క నెదుటఁబెట్టుకొని—కొంతసాహసము తెచ్చుకొని రాజుగారిని దలవాచునట్లు నాల్గుమాట లన్యాపదేశముగా దులిపిదులిపి విడువలేదా?

సుంద—మీరు దులిపినమాటలేవో తన్నుఁగూర్చినవి కావని యాయన వెంటనే దులిపివేసికొన్నాఁడు కాఁబోలు.

ఇందు—అట్లుకాదులే. అప్పటికిఁ గొంతపశ్చాత్తాపము వచ్చినట్లు కనఁబడినదిలే.

సుంద—మీకట్లే కనఁబడును.

ఇందు—కాదు కాదు. ఇఁకఁ బరస్త్రీ నపేక్షింపనని మీయక్క యెదుటఁ గొన్నిప్రమాణములుగూడఁ జేసినాఁడు.

సుంద—దైవము నెదుటఁ జేసినప్రమాణములకు లెక్కలేదు కాని దాసియెదుటఁ జేసినవానికా? అందులో విటుల ప్రమాణములా విటునిప్రమాణములు, నటుని రోదనములు చెప్పనక్కఱలేదు. రాజు గారట్లు ప్రమాణము చేసినారని మీరు భయము లేకుండ నప్పటినుండియు నుంటిరి కాఁబోలు!

ఇందు—ఉండక—యెంతసేపు కౌఁగిలించుకొని కూరుచుండుదును? ఎంతసేపు చెంగున ముడివైచుకొని తిరుగుదును? ఎంతసేపు కన్నుఱెప్పల మూయకుండఁ జూడఁగలను?

సుంద—మీ రతనిని గనిపెట్టుకొనియుండినఁ బ్రయోజన మేమున్నది? అతఁడు మిమ్ముఁ గనిపెట్టుకొని చుట్టుచుట్టు తిరుగునట్లు చేయుట ప్రయోజకత. పతుల వశముచేసికొన్న సతులందఱు వారిని ముకాయవలె రొంటఁ బెట్టుకొనుచున్నారా? గడియారము వలెఁ బెట్టుకొనుచున్నారా? కుక్కలవలె మంచపుఁగోటికిఁ గట్టుచున్నారా? కనుబొమముడిచేఁ గట్టివైచుచున్నారు. కోరచూపు-

గడగడలాడించుచున్నారు. తర్జనిజే నిర్జించుచున్నారు. భయపెట్టినఁ గాని బతిమాలిన భటుఁడు పనిచేయునా? కఱ్ఱ చూపవలయును గాని గంగడోలు దువ్వినయెడల గంగిరెద్దు తలఁగదలుపునా? కొరడ చూప వలయునుగాని గోఁకినయెడలఁ గోతి కృష్ణవేష మభినయించునా?

ఇందు—సుందరీ! ఎందులకే యాచదువు? నాభర్త నీసారి బెదరించి శిక్షింపుమనియేకదా నీవనఁదలఁచినమాట!

సుంద—అమ్మా! నే ననుట యెందులకు? నేను జెప్పుట యెం దులకు? మీకేల తోఁచఁదగదు. అయిన నొకరుబోధింపవలసిన యం శమా యిది? అభ్యసించుట కిదియేమి యన్నప్రాశనమా? వల్లెవేయు ట కిదియేమి వేదపాఠమా? కావ్యము లెవఁడైన నేర్పఁగలఁడు కాని, కవిత్వ మెవఁడు నేర్పఁగలఁడు? చొకతానవర్ణములు సాగఁదీసి వల్లింప వచ్చును గాని, స్వరకల్పనము కంఠపాఠమునకందునా? మగని వశప ఱచుకొను శక్తి పుట్టుకతోడనే కలుగవలయును. అమ్మా! యిటులం టినని కోపపడకుము.

ఇందు—సుందరీ! నేను గోపముగలదాననే యగునెడల నాపతి యింత మితిమీఱిపోఁగలఁడా? నన్నీకష్టమునుండి తరింపఁజేయఁగలవని నమ్మిన నీపై నేను గోపపడుదునా? పతివశీకరణకార్యమున నీవు మి క్కిలి గడుసుదానవని నీయక్కవలనవినియే నిన్ను రహస్యముగ మీ యూరనుండి యిటకుఁ బిలిపించితిని.

సుంద—అమ్మా! అటులైన వినుము. నామాట నేను జెప్పు కొనఁగూడదు కాని—నేను జేరదీసిన యయ్యవారులున్నాఁడే—ఆతఁ డు పట్టి వన్నెలవిసనకఱ్ఱ. సంగీతములో, సాహిత్యములో, సరసత సమర్థతలో, స్వరూపములో సంపూర్ణుఁడు, కాని పట్టిచపలుఁడు ... దిజాలికుఁడు. పట్టిదొంగలగురువు. కనుమూసి తెఱచులోపల న... కొంతలు చక్కఁబెట్టుకొని వచ్చు నైజముకలవాఁడు. ఎక్కుగడప ...

గుణదపయే కాని యొక్కచోనైనఁ గాలు కుదిరియుండువాఁడు కాఁడు. దేనికిని లొంగినవాఁడు కాఁడు. నేర్పరియైన సవారు మిగుల పొగరుబోతుగుఱ్ఱము నెఱిఁగియుండి యెట్లు త్రిప్పునట్లు నే నాతని సాగఁదీయుటకై నా నేర్పు లోకమునకుఁ గానఁబఱచుటకై అపరగి నామాలపై యాటల పండితుని దీసికొంటిని. అమ్మా! చెప్పిన నమ్ముదువో లేదో! మునుపటి కోడెగానితన మేమయ్యెనో? ఇప్పుడు పట్టిగుక్కినపేను, మునుపటి చిలుకపలుకు లేమయ్యెనో యిప్పుడు పట్టిచీఁపురుపుట్ట. మా పాదములే యిప్పుడు దాసాధ్యునకుఁ దిగునడిత్రాడులు. నా ప్రతిభా విశేషమున నాతఁ డిట్లయ్యె నని మాయక్క మీతో పసపుచేసికొని యుండెదుగాఁబోలు! ఏమో? ఎక్కడికి? నేనే మహామహోపాధ్యాయినినాయేమి? ఎల్లప్రతిభలలోవలె దీనిలోఁగూడ నొకరిని మించిన వా రొకరుండవచ్చును.

ఇందు—ప్రతిభ ప్రధానమైనదే కాని, మీ రేవో మందు పెట్టి పతివశ్యము చేసికొందురటే?

సుంద—అట్టి వైద్యమేయున్నయెడల నది చేతగాని పెద్దమ్మ చేయవలసినపని. కంటిలోఁ గలుగుచున్న కాంతకుఁ బతి చెవిలోఁ బసరుతోఁ బనియేమి? ముద్దులో నీటున్నదానికి ముద్దుతో మాటేల? మాటలో వడియున్నదానికి ముక్కులోఁ దిరియేల? ఎట్లైనను గప్పను బట్టినది పాము—కాంతు నేలినది కాంత.

ఇందు—నిజమే! భర్తను వశపఱచుకొనలేనిది దొరసానియైనను దాసియే.

సుంద—అంతే కాదమ్మా! వశపఱచుకొనినది దాసియైనను దొరసానియే.

ఇందు—హుఁ! నిజమే. పతివశ్యము లేని యాఁడుదానిబ్రతుకు లఘుపదార్థము ప్రపంచమున మఱియొకటి గలదా? మగని

కన్ను మఱియొకమగువపై వ్రాలినప్పుడు మహాలక్ష్మి నాకనుసన్నమెలఁగిన నైననేమి ? మగఁడు పరకాంతతో నిగిలించినప్పుడు మహాదృష్టదేవత నన్నుఁగాంచి మందహాసముచేసిన నైననేమి ? ఈరత్నాభరణములు — ఈగజకంఖాణావైభవములు — ఈరాజ్యభోగములు నాలాఘవమును, నానీచతను, నానిర్భాగ్యతను మఱింత వెల్లడించుటకే యుపయోగించుచున్నవి కావా ? ఊరు పేరు లేని యాఁడుదానికి నావంటి యవస్థయే పట్టినయెడల నది యెవరికిఁ దెలియును? దానియుబ్బసైనతెరుఁగావలెను ? నాగతి యట్లుకాదే? రాజ్యముననున్న యయ్యాకొయ్యలందఱు నన్నుఁ దలఁచి పకపక లాడువారే. అమ్మలక్కలందఱు నాపేరెత్తి బుగ్గలు నొక్కుకొనువారే. చేతవాతగాని పెద్దమ్మయని — పట్టి మట్టిముద్దయని — వంకరటింకర కొంకనక్కయని — జ్యేష్ఠాదేవి యపరావతారమని యందఱు నన్నెత్తిపొడిచి దుర్భాషలాడువారే. కనకపురపురాణి యని బ్రహ్మాండమంత పేరు. మూరెడుకోటలో నూటయేఁబదంతఃపురములు. బాపనరాణులు, కోమటిరాణులు, శూద్రరాణులు, తురకరాణులు, దూదేకులరాణులు రాణులమంద — కాంతలసంతె — భార్యలబందెలదొడ్డి; జాతియేమి? నీతియేమి? హద్దేమి? పద్దేమి? ఇఁకనీనానాసంకరసపత్నీసమాజము చూపులతడకలనుండి నన్నుఁ జూచి వెక్కిరించుట. కిటికితలుపులసందులనుండి మెటికలువిఱుచుట. తలుపుచాటులనుండి తలపంకించుట. ఇట్లున్నది నాబ్రదుకు ! వీరిదనుక నెందులకు ? నాకాళ్లుకడుగఁదగని దాసీముండలు సైతము నాగతి చూచి పైటచాటునఁ గిచకిచలాడుచున్నారు.

సుంద — అమ్మా ! ఎంతమాట ! మీమనసులోని సందేహమున మీకట్లు తోఁచెనేమో కాని మీయెంగిలిమెతుకులఁ దినుదాసీలు లేమి? అట్లు చేయుటయేమి?

ఇందు—నేనసత్యమాడ లేదు. భ్రమపడ లేదు. నిన్న గాక మొన్న సాయంకాలమున నేను జాపపైఁ బండుకొంటిని. నిలువుదిండు నా పక్కను నిలువుగఁ బెట్టియున్నది. దానిపైఁ జేవైచి దానిదగ్గఱగఁ జేరి పండుకొంటిని. అప్పుడు నా కాళ్ళొత్తుదాసి విసరుచున్న దాసిని వంకగాఁ జూచి కన్నుగీటెను. విసరుచున్న దాసి మొగమునకు వీవనయడ్డు పెట్టుకొని కిసుక్కుమని నవ్వెను. ఇట్టు బ్రదుకుటకంటె మరణించుట మంచిది కాదా?

సుంద—మీరు మరణించినందువలన మహారాజునకు బుద్ధి రాగలదా? మానవతియగు నాఁడుది తన స్వప్రయత్న మెంతవట్టునకుఁ బోఁగలదో యంతవట్టునకుఁ జేయవలయును. అప్పటికిని మనోరథము నెరవేఱకుండెనేని మరణింపవలసినదే. ఆకసిని వెంగున ముడిపై దుఃఖ ప్రయత్నము చేయకుండనే గొంతుకకు ముడిబిగించుకొనుట యభిమాననకులక్షణము కాదు. అశక్తికిఁ బుట్టుక చేదాసినైన నాకీయుపద్రవము దుస్సహముగనున్నది. నేనిట్టి యవస్థననుభవింపనిదాననైనను మీహృదయఖేదము నెఱుఁగుటకుఁ దగిన తెలివితేటలు నాకున్నవి.

ఇందు—నీకట్టి తెలివితేటలే కావు. నాకుఁ బ్రేమాస్పదమైన దాసి చెల్లెలవగుటచే నీకట్టి ప్రేమకూడనున్నదని మీయక్క చెప్పినది.

సుంద—అక్కమాటలేమి యాగమవాక్యములా? అనుభవమున మీరే కనిపెట్టుదురుగాక! మాయక్కయైన నాతో నిన్నిమాటలు చెప్పలేదు. దానితోనైనఁ జెప్పనిరహస్యములుకూడ నాతో మీరు ... టఁబట్టి మీకు నాయందెంత ప్రేమయున్నదో కనిపెట్టలేనా? ఇందు... ంఁ దగిన యభిమానముతోఁ బ్రవర్తించి మీయభిసంధిని సమకూర్పలేనా? చూతురు కాని చావునకైన నొప్పి పెట్టక యెంతపని చేయుదునో

ఇందు—అయ్యయ్యో! చావునకైన లక్ష్యపెట్టక యును చున్నావు. నాకు భయము పైచుచున్నది. ఆతనికేమైనమందులు పెట్టిన యెడల మొదటికే మోసమువచ్చునేమో ?

సుంద—అమ్మా! నాచావుమాట చెప్పితిని. మందులుపయోగింపనని యిదివఱకు సూచింపలేదా ?

ఇందు—నిజముగానేకద!

సుంద—మీపాదములతోడు.

ఇందు—అట్లైన నేమిచేయుదువు ?

సుంద—నేను మీయొద్దనేయుండి యంతయు మీచేతనే చేయింతును,

ఇందు—ఏమైన దంటామాటలతోఁ గుట్రపనులతో మారువేసపుగోడవలతో నన్నుదింపుదువేమో ? అది నాకంతయిష్టము కాదు.

సుంద—వంకరకఱ్ఱను సరిచేయుటకు రవంతవట్టనైనఁ జూపవక్కఱలేదా? కస్తితిగానిఁబట్టుకొనుటకుఁ గొంతయుచ్చునైన నుపయోగింపఁడగదా? మీకిట్టిదేదియు నిష్టముకానిచో మీరీవ్యాపారము నదిగకుండుటయే మంచిది,

ఇందు—దిగకి నేమిచేయుమంటివి ?

సుంద—ఏమున్నది? ఆతనిచర్యలఁగూర్చి చెవులుమూసికొనవలయును. సపత్నులయెడలఁ గన్నులుమూసికొనవలయును. వైరాగ్యమవలంబించి ముక్కుమూసికొనవలయును.

ఇందు—అట్లునోరుమూసికొని పడియుండుటకు సహనశక్తి యేది ? ఇదివఱకదియుండెను. ఎన్నటికైనగుణము మారకపోవునా [illegible] భర్తనేల నొప్పింపవలయును? అని చూచిచూడనట్లుంటిని. [illegible] యొక్కసారియే కొంచెము కఠినముగ నాతని [illegible]. ఇదివఱకు [illegible] దేఁబడిన కాంతలందఱు కేవలముంపుడుకత్తెలు. పాకలో నిరుక్కఁబిడారము [illegible]

నువలె గుడిసెలోని కోళ్లగుంపునువలెనే నంతలక్ష్యముగాఁ జూడలేదు కాని యీనవీననారీమణిని రాణిగాఁ జేయ ననుకొనుచున్నాఁడని వినినప్పటి నుండియు నాసహనశక్తి చచ్చినది.

సుంద—అమ్మా! ప్రస్తుతబాధపడలేక గౌరవహాని సహింపలేక—కడుపుడికి మీరిన్ని మాటలు చెప్పితిరి కాని మీవైఖరిని జూడఁగ మీకు యథార్థమగు నసూయ హృదయమున జనించినట్లు నాకుఁ దోఁచుటలేదు.

ఇందు—సుందరీ! నీకేమి వెఱ్ఱి! భర్త పరాంగనాలోలుఁడగు నెడల భార్యకసూయ లేకుండునా? అది ప్రకృతిధర్మము కాని బలాత్కృతమా? యథార్థమగు నసూయయని యుంటివి యథార్థమని కృత్రిమమని రెండా?

సుంద—ఆ—మీయసూయ సత్యమగునది కాదు. ఉండు కత్తిలేకదా యని నేను వారిని గణింపలేదని చలింపకుండఁ జల్లగఁ తిరే? అసూయావతి యిట్లుండఁగలదా! అనఁగలదా! నాభర్త—మాటవరుసకు—ఇంకొకదానిని దెచ్చుటయే కెందులకు? చూచుటయే కెందులకు?—తలపెట్టినంతమాత్రమున నాడు పైఁబెట్టినా?

ఇందు—ఔను. నీవట్లు చేయ శక్తిగలదానవు. నాకట్టి శక్తి లేదు. కాని నీకున్నయసూయ నాకు లేకపోలేదు సుమా!

సుంద—శక్తి శక్తి యనుమాట నేను నమ్మను. మీకు లే శక్తి యేమి? నాకదనముగనున్న శక్తి యేమి? అసూయయే శక్తి. అది చిచ్చుకంటె నది తీక్ష్ణమైనది. వెఱ్ఱికుక్క కంటె విషముగలది. పి[illegible]ంటె బెట్టిదమైనది. అది హృదయమునఁ బుట్టినప్పుడు చల్లనిమ[illegible]ు, జడియుటలు, జంకుటలు, సంకష్టములు సంభవించునా? అది ప్రవేశించినపుడు తలవెండ్రుక త్రాఁచుపామగును.

ఇందు—అందుచేతనే యెటుపోయి యెటువచ్చునోయను భయము.

సుంద—అట్టి భయముచేతనే యసూయపుట్టకుండఁ జేసికొని నారుకాఁబోలు!

ఇందు—పుట్టకుండఁగాదు. ఉండనేయున్నది. వృద్ధిపొందకుండఁ జేసికొనుచున్నాను.

సుంద—అమ్మా! యీసారికూడ నటులే చేసికొని యూరకుండరాదా?

ఇందు—నేనాఁపిననుు నాఁగకుండనున్నది. ఆ! కామతంత్రవ్యాపారమున కక్కఱకువచ్చు నూర్గురు కామినులనుదెచ్చి తనప్రక్కలోఁ బెట్టుకొనరాదా? నేను వలదంటినా? ఈసారి దీనిని రాణినిజేసి నానెత్తిఁ ద్రొక్కింపఁబూను టెందులకు? తనముచ్చటఁ దీర్చుకొనుటకు గాదు—నన్నుఁ బరాభవించుటకు. తనకోర్కెఁ దీర్చుకొనుటకుఁ గాదు—నాగొంతుఁ గోయుటకు. రాణియని నదుట వ్రాసినఁగాని ప్రక్కలోనికిఁ బనికిరాదు కాఁబోలు!

సుంద—అమ్మా! కడుపులోఁ గావలసినంత యాఁకలి యయ్యెను. నోట నొక్క కబళమైనఁ బెట్టుకొనవయ్యెను. నీటిలోమునిఁగి కెక్కుకెక్కుమని కొట్టుకొనుచుంటివయ్యెను. చేయి యందిచ్చిన నందుకొనవయ్యెను. ఇదియేమి?

ఇందు—ఏమున్నది? నేను బరమశాంతురాలను. పాపదూరురాలను. భర్తృవిధేయను. ఈతని వెనుకటి కుర్నయములను గణించినదానను గాను. ఎన్నఁడు నాతనిపై నేమి యెవరిపై నేమి కోపవ... నుంగను. ఈసారి నాకుఁ గోప మావిర్భవించుచున్నది. జన్మకాలేనీ... ను శాంతిచే దాని నాఁపుకొనుచున్నాను.

సుంద—సరే. బాగుగా నేయున్నది. ఇంతటితో సరియా? చేయవలసినదేమైన నున్నదా?

ఇందు—తగురీతిం బ్రతిక్రియ—ప్రతిక్రియ.

సుంద—"తగురీతి"యనఁగ నేమి?

ఇందు—చెప్పలేదా? మాయలు మర్మములు తగవు. వేసములు మోసములు తగవు.

సుంద—తగక?

ఇందు—తగవు; ధారాళముగా నాతనితో నీకిది తగదు—తగదు—తగదని మాటిమాటికిం గఠినముగాఁ జెప్పి నీతిని బోధింతును.

సుంద—(నవ్వుచు) నీవు కఠినముగనైన నట్లుచెప్పుట యెందులకు? క్షేమధర్మములు చెప్పించినయెడల నీతివచ్చునేమో! లేదా సత్యనారాయణవ్రతము చేయించినయెడలఁ జక్కఁబడునేమో?

ఇందు—నవ్వెదవేమి? నీత్యుపదేశ మిట్టిస్థితిలోఁ బరిహాసింపవలసినదియు, నిరాకరింపవలసినదియుఁ గాదు సుమా?

సుంద—వేదములు, శాస్త్రములు, పురాణములు, నితిహాసములు, నీతిశతకములు, బ్రహ్మగీతములు, త్రిమతభాష్యకర్తలతో గూడ సంఘసంస్కర్తలతోఁగూడ బోటఁబొడిచి రసముతీసి యాతగొంతులోఁ బోసినను గార్యములేదు.

ఇందు—ఎందుచేత?

సుంద—నాల్గుపదులు వీరాఁడికివచ్చినతరువాతఁగూడ దుర్బుద్ధినుండు మగవాఁడు, మగువయు నాల్గుభుజములవీరాఁడికి వచ్చువఱకు యుందురు.

ఇందు—నలువదింక దాఁటలేదే? ఇంక నాలుగైదు తరువాయుమే యున్నవి శాఁబోలు!

సుంద—దాటకపోవుటయేల? దాడలు దగ్గఱంబడెను; దంతము లెడముపడెను; మొగము ముడుతలువడెనని మాయక్క చెప్పినదే?

ఇందు—ఈ యసాధారణచర్యచేతనే—నీవిటకు మాయూరనుండి వచ్చినతరువాత రాజుగారిని జూడనేలేదా?

సుంద—దూరమునుండి చూపినటులే చూచితిని. సరే. సలుపది దాటలేదు. అటులైన—

ఇందు—నేను చితరీతిని బోధించుటయే కాక—కొన్నినాళ్లవఱకుఁ దగినయుపదేష్టను బెట్టించి నీతిని బోధింతును.

సుంద—అటులైన నన్నెందులకుఁ బిలిపించితిః?

ఇందు—మనమాలోచించుకొని ప్రవర్తింపవలయుననియే—

సుంద—ఏమి? నీతి నుపదేశింతువా? నీతియుక్తముగఁ బదునెనిమిదిపురాణములు, భారతమును వ్రాసిన వ్యాసుఁడు పరకాంతను జూచి వండ్లిగిలింపలేదా? కడుపులో నీతి పుట్టినవానికే గతిలేదుగాని వసఁదీసి చెవిలో నీతిని దిరిపెట్టఁబడినవానికా?

ఇందు—మహర్షి దూషణము తప్పు.

సుంద—మనరాజుగారికట్లు నీతిగలుగుననుట యింతకంటెఁ దప్పు. ఆతనికిఁ జదువుట కోపికయేది? వినుటకైన, నవకాశమేది? కూరుచుండుటకైనఁ దీరికయేది? ముండలవెంటఁ బరువెత్తువానికి వెనుకపాటున భగవద్గీతాపురాణపఠనమేమి సొగసుగనోయుండును!

ఇందు—ఏమి? నామాట నీకు నచ్చలేదా?

సుంద—నాకొక్కతకే కాదమ్మా! కన్నగానికిఁ గార్తికనక్షత్రములా? సురాపాయికి సూర్యనమస్కారములా?

ఇందు—నీయభిప్రాయ మట్లున్నది కావున నాభర్తనెదురొని నుంచొకసారి కఠినముగా మాటలాడిచూతును.

సుంద—ఏమని?

ఇందు—"శ్రోత్రరాణి నెచ్చటనుండి తెచ్చితివో యంటయు సగారవముగఁ బాపుము. లేనియెడల బాగుగా జరుగనేరదు. వివాహమాడితివేని నిద్దఱురాణులు నీకనావశ్యకము కావున నేను గాశికిఁ బోయెదను." అని యిట్టిమాటలేవో యప్పటిరాకవచనమునుసరించి—

సుంద—అటులైన నీ వాతని యభీష్టము నెఱవేర్చినదానవగుదువుగాని యెదురొక్కనినదాన పెట్లగుదువు?

ఇందు—ప్రాణము విసిఁగి నేనే లేచిపోవలయునని యే యాతఁడు దీనిని దెచ్చెనందువా? ఆహా! అటులే యైయుండునా? ఎంతద్రోహము! ఎంత విశ్వాసఘాతుకత! ఎంత గొంతుకోతదనము! పదునాలుగేండ్లనుండి కాపురము చేయుచుంటినే!— కంటికొన యెఱుపుగాని-నాలుకకొన కటువుగాని లేకుండఁ గాలక్షేపము చేసితినే!—అడుగులకు మడుఁగులిడితినే!—అట్టి నన్నుఁ గోటనుండి తఱిమివేయుట యీపని చేసియుండునా? సుందరీ! నిత్యాంతర మేమైననున్నదా?

సుంద—లేకేమి? అది మీరు చేయుట కిష్టపడకున్నారా?

ఇందు—మోసమేనా? అంతకంటెను మంచిది దొరకినప్పు డిష్టముకాకేమి!

సుంద—ఇట్టికార్యములలోఁ బాలితో సమానమైనది లేదు. అడవియేనుఁగును గోతిలోఁ బడఁద్రోచి పట్టుచున్నారా? లేదా? చేదుమాత్రల మ్రింగని చిన్నపిల్లలకామాత్రలనే పంచదారతోఁ బొదివి యిచ్చి రోగనివృత్తి చేయుచున్నారా లేదా? ఎఱ్ఱగుచ్చిన గాలము వైచి చేపను లాగుచున్నారా లేదా? లోకాచారమును నిందునఁ దప్పేమియు నాకగపడలేదు. మీరెందులకింత సందేహించుచున్నారో?

ఇందు—సందేహము వలదు. (ఆలోచించి) లేదు సందేహము? తిరుపతిమహాంతుగారి సవారివచ్చుచున్నదని నాతోఁ జెప్పినమ్మిక జేసి నన్ను మఱియొక యంతఃపురమునకుఁ బంపి యీసవరిలో నెక్క

వచ్చిన మహమ్మదీయవేశ్యయుఁదాను—నిచ్చటనే—నాయంతఃపుర ములోనే—యిల్లాలనైన నాయంతఃపురములోనే—మహారాజ్ఞినైన నాయంతఃపురములోనే—హవ్యవాహసన్నిధినిధర్మాచరణమునకైకూర్పఁబడిన ప్రభుదంపతుల పవిత్రమైన యీయంతఃపురములోనే—త్రికాలదీక్ష నిర్వహింపలేదా. ఇటులన్నిసారులునన్ను మోసముచేసి యుండలేదా?

సుంద — తిరుపతిస్వామిని దురకసానిని జేసిన దేవాంతకుఁడు తిరుప్పావుకాలక్షేపమున నాచార్యపురుషుఁడగునా!

ఇందు—అతనిపూర్వచర్యలాలోచించినకొలఁది నాడలుమండుకొనిపోవుచున్నది. వానినన్నిటి నేనెట్లుసహింపఁగల్గితినో నాకేయాశ్చర్యముగనున్నది. మొట్టమొదటనేయేదైనఁ గట్టుదిట్టమైన పనిచేసి యుంచినయెడల నింతవఱకు రాకయుందునేమో.

సుంద—ఇప్పుడైన మిగుల నాలస్యముకాలేదు పట్టుదలతో మాత్రము పనిచేయవలయును.

ఇందు—ఏమిచేయవలయునో చెప్పుము.

సుంద—నేనుమాత్ర మాలోచించుకొనియుంటినా? ఏదోమన మాలోచించి కాలికిమెడకు మెలతవేసి యాతని నొకమూలఁబడఁ ద్రోచి సిగ్గుతెప్పించి బుద్ధివచ్చునట్లు చేయవలసియున్నది.

ఇందు—మనమాలోచించి యనుచున్నావు. నేనాలోచింప నక్కఱలేదు—నీయిష్టమెటులో నేనట్లు చేసెదను. నీభర్తను నీవువశపఱచుకొనినట్లే నాభర్తను నేనువశపఱచుకొనునట్లు చేయుము. నీవు మనుష్యురాలి నన్నిందుకొఱకే యిందుకుఁ బిలిపించితిని. ఈగ్రామపువా నిన్నెవ్వరెఱుఁగరు కాదా.

హా

సుంద—నన్నెవ్వ రెఱుఁగుదురు? నాయక్క యింట నేనుండిన యెడలఁ గోటలో దాసికి బంధువని యెవ్వరైన ననుకొందురేమో అట్లేల జనులనుకొనవలెను. మఱియొకచోట బసచేసెదను.

ఇందు—ఊరికెవతెయో క్రొత్త దాసివచ్చినదని జనులు గుబ్బెటలుపడుదురేమో ?

సుంద—ఆవిషయమున నేనేమో పాట్లుపడెదరు; కాని ప్రయత్నములో దిగినతరువాత మీరు వెనుకకుఁదీసిన యెడల—

ఇందు—నేనంత పిఱికిదానననుకొంటివా! (వెనుకకుఁజూచుచున్నది.)

సుంద—అమ్మా—అప్పుడే వెనుకకుఁజూచుచున్నా వేమి?

ఇందు—అదిగో—మాఘుఁడు రాజుగారితో మాటలాడి దిడ్డిగుమ్మమునుండిపోవుచున్నాడు. ఈతఁడిప్పుడు పాత్రిసావేలీలో భద్రముగ దాఁచఁబడుచున్న యాక్రొత్త రాణిగారికేదో వార్తనుమోసికొని పోవుచున్నాఁడని తోఁచుచున్నది.

సుంద—చప్పున మేడదిగి యటుపోయి వానినెదుర్కొని మాటలాడుదును.

ఇందు—సరేపొమ్ము (సుందరిపోవును) తల నొచ్చుచున్నది. గుండెకొట్టుకొనుచున్నది. కాళ్లువడఁకుచున్నవి. మ్రొక్కవలసిన భర్తను మోసముచేయవలసివచ్చినది—బహుమానింపవలసినభర్తను బరిభవింపవలసివచ్చినది— పూజింపవలసిన కాంతుని దూషింపవలసివచ్చినది. కాదామఱి? నాగౌరవమును గాపాడినాఁడా? నామగనాలితనమును మన్నించినాఁడా? నాయాభిజాత్యమునైన గణించినాఁడా? ఎంతకాలము నోరుమూసికొనిపడియుండ లేదు? ఇఁకసహింప లేను సహనశక్తి తప్పినది—మనుష్యజన్మముగాని మఱియొకటి కాదే—సుందరియీ పరికి ముని గలసికొనెనో లేదో—నేనిఁక మేడదిగిపోయి పండుకొందును ...రీ! ఏమిబాధగానున్నదయ్యా! (ఇందుమతి నిష్క్రమించును)

ఇది ప్రథమాంకము.

శ్రీరామ.

# ముద్రిక.

---

## ద్వితీయాంకము.

---

ప్రదేశము. వీధి.

ప్రవేశము—మాఘుఁడు.

మా—హాఁహారీ! ఏమిబాధగానున్నదయ్యా! ఈబాధతనవు తోడనే కాని నివర్తించుననితోఁచదు. ఇద్దఱా, ముగ్గురా, పదుగురా? మోపులు, గుంపులు, తండోపతండములు. ఇటుతీసికొనివచ్చుటయు—అటుకొట్టులో వైచుటయు—తిరుగ దాని మొగము చూడకుండుటయు. పగటిది సాయంకాలమువఱకుఁ బనికిరాదు. సాయంతనపుది రాత్రికిఁ బనికిరాదు. దృష్టిపాఱినవెంటనే తెచ్చినదాఁక నొక్కటేతహతహ. ఒక్కటేగిలగిల. తెచ్చినయొక్కనిముసమువఱకుఁ బెద్దముచ్చట. తాటాకుమంట. అటుపైనివిరాగము. దానిపైఁ గొట్టులోనబీగము. కోమటియపరదినుసులను గాదులలోఁబోసినట్లు చేయుచున్నాఁడు. పసిడిధనపుగోతములను గోతిలోఁ బెట్టునట్లు పెట్టుచున్నాఁడు. కృష్ణుఁడు, కోమటియుఁ దమసరకుల నాత్రమునఁదఱచుగఁజూచుకొందు[illegible] మూసిపెట్టినపిదపనితనికి ముందుదృష్టియేకాని వెనుకదృష్టిలేదు. వింత పశువులను వేలువేలుసంతలకుఁ బోవునట్లు వివిధజాతులకాం[illegible]లై వేలువేలు క్షేత్రములకు మంచితీర్థయాత్రాసమయములఁబోవు

దీపకాంతికిఁ జేరిన పురుగులను బట్టుకొనుటకు బల్లి కాచియుండునట్లు కాచియుండును. ముచ్చటఁదీర్చుకొనినపిమ్మట నొక్కొక్కతెవపలకుఁ ద్రోలివేయఁగూడదా? ఊహు. అదిపనికిరాదు. గదులు చాలక యొక్క గదిలో నిద్దఱను గూడ బస్తాబందీ చేయుచున్నాఁడు. నీరండఱు పడు క్షోభము—హరిహరీ!—పగవానికైనవలదు. రాజుగారు చేపట్టిన యెడల నేదో యఖండవైభవమున్నదనియు, నంతఃపురమునఁ నమ్మగారైనయెడల నసాధారణభోగమేదో యున్నదనియు నీపెద్దమ్మలాసపడి యిచ్చటికివచ్చి మగవానికి మొగమువాచి పెగురుతపకఁ చాటున జనపనారసంచుల తెరలచాటున నెత్తినోరు కొట్టుకొనుచున్నారు. ఎవరి మట్టునకు వారేనన్నుఁబిలచి "మాఘుఁడా! రాజుగారితో నన్నుఁ గూర్చి చెప్పవా?" యని బతిమాలువారే. చెప్పినయెడల నాజగజెట్టిజారుఁడు ముందు సంతనుగూర్చి ముచ్చటించును. వీరినమునేను దిరుగ లేకపడుచున్న బాధ—హరిహరీ!—తనువృథోడనే కాని నివర్తించునట్లో లేదు అదిగో! అప్పుడే యెవ్వతెయో నాకొఱకే కాబోలు వచ్చుచున్నది.

(సుందరి ప్రవేశించును)

సుంద—రాజమిత్రమా! నమస్కారము.

మా—నమస్కారమునకేమికాని నీవెవ్వరిదాసనవో యెందుకొఱకువచ్చితివో వేగ చెప్పుము నాకుఁబనియున్నది.

సుంద—ఇదిగో! నావంక బాగుగఁ జూడుము. నేనెవ్వరిదాసినో యెఱుఁగనవా లేపట్టలేవా?

మా—నూటయేబదియొక్క యంతఃపురములున్న ననపురి దాసి కానవా లేవా? కిష్కింధలో గోత్రుల కానవా లేదు?

సుంద—(మాఘునిచేయిపట్టుకొని) ఇటుచూడుము. కన్నులు [illegible]చుకొని యిటుచూడుము. నన్నెఱుఁగనే యెఱుఁగవా?

మా—చేతినివదలుము. ఇదివఱకున్న బానిసలలో నా చేయి పట్టుకొని నాతోనింతచనవు తీసికొనిన దెవతెయును లేదే. నీవు క్రొత్త దాసివా యేమి ?

సుంద—నీ కేమిదృష్టి మందమా? బుద్ధిమందమా? నీవు నన్నొక్కసారియైనచూచినది ?

మా—ఎప్పుడు ?

సుంద—నీవు మాయమ్మయింటికి వచ్చినప్పుడు నేనునిన్ను లోనికిరమ్మని చెప్పలేదా ? ఉచితాసనమునఁ గూరుచుండఁబెట్టలేదా? రాజుగారి క్షేమ మడుగలేదా ? మాయమ్మగారు లోననున్నారు. ఇప్పుడే యిటువచ్చి మాటలాడుదురని చెప్పలేదా ? ఇవి యన్నియు మఱచి పోయితివా ?

మా—రాజుగారినిబట్టి సామాన్యముగ బానిసలెల్లరు నాకుఁ జేయునుపచారమిదియే. నీవు వారిలోనే బానిసవో నాకెట్లు తెలియును?

సుంద—సామాన్యోపచారములగుటచే జ్ఞప్తి లేదు కాఁబోలును ఇట్టియసాధారణోపచారమైనయెడల నాచంద్రార్కము జ్ఞప్తి యుండునా ? (లెంపపైఁగొట్టును.)

మా—ఓసి ! నీవుముండమోపు ! దాడపైఁగొట్టెదవా ?

(కఱ్ఱయెత్తి కొట్టఁబోవును)

సుంద—(దెబ్బతప్పించుకొని) నీచెంపకు నేఁటికైన మహాభాగ్యవంతమగు యోగము పట్టుటచేతఁగదా నాచేతిపెట్టు నీకుసిద్ధించెను ! ఎవనికి సిద్ధించును? ఎంతవారికి సిద్ధించును ? కోటీశ్వరులకుఁ బ్రభువులకుఁ బ్రధానులకుఁ జిరకాలాశ్రయశ్రమమున విశేషధనప్రదానమునఁగాని సిద్ధింపని యీమహాగౌరవము నీమహాపుణ్యముచే నీకనాయాసమున గలిగినది. నీవుత్తరజన్మమున దేవేంద్రుఁడవయ్యెదవు. నీజన్మ మి దరించినది. పో !

మా——ఓసి! నీయిల్లుమాసిపోను! నీనాలుకఁగోయ! దొడ్డ పెట్టుతో దేవేంద్రత్వ మీయఁగలముండవు నీవవతెవు? ఇటురా! నాకుఁ జూపుబాగుగానాఁదు.

సుంద——కన్నులుసార్థకములగునట్లు నన్నుఁజూడు. నీకుబుద్ధి వచ్చినయెడల నీరాజునకుఁ గూడ బుద్ధివచ్చును. ఏది? ఒక్కదానిని— నావంటిచక్కనిచుక్కను——నావంటి వాలుఁగన్నుల వగలాఁడిని—— ఎక్కడికక్కడికిఁదగినయంగున్న నావంటిబంగారుబొమ్మను——మాట లతోఁడనే మరులుకొలుపఁదగిన నావంటిసెఅజాణను——ఏది? మీకోట లోని నూటయేఁబదియొక్క యంతఃపురములలో నొక్కతెను జూపిం పుము. ఇటులున్నది మీరూపగ్రహణశక్తి. అనుభవించురసజ్ఞతమాట తరువాతఁ జూచుకొనవచ్చును. ముందుఁదగినదానిని మెచ్చుకొనుటకే మీకుఁ దెలివితేటలు లేవే? తెచ్చితిరి! బంగరుఁబెట్టితిరి! పురులఁగట్టితి రి! పాతరగోతులఁబోసితిరి! తీసివ్రేఁతసరకులను——దిక్కుమాలినపెంట ను——సంతబైటితుక్కును—— ఎలజాజితీఁగయేదో——మొలుకచివికూర యేదో, చెంగలువపూవేదో——చెంగలిగడ్డయేదో, పశువులకైనఁ దెలి యునుఁగాని మీకుఁ దెలియకపోయెనే! ఇట్టిప్రయోజకత బ్రష్టలై నిన్నుఁజెంపపైనిట్టియన్నందులకు——ఇంతకోపమువచ్చినదా? నిన్ను జెంపపగులఁగొట్టవలయునా? చేతఁగానివృత్తిలోఁ దగుదునమ్మాయ సిద్ధపడినందులకు సిలువునఁజీల్పవలయునా?

మా——(కఱ్ఱమెత్తి) తలపగులఁగొట్టెదను. జాగ్రత్త! వః కూఁతలు రానీయకు. అంతఃపురస్త్రీలచేనైన రవంతమాటపడనినే దాసిముండవైన నీచేతఁబడుదునా?

సుంద——అంతఃపురకాంతలా? అంతఃపురమను మాట గా ...ము కూడఁదగుఁబెట్టకు. దొడ్డికాళ్లదొరసానియొకతె. మూ ...గామాలతాడియొకతె, బాకినోటిబానిసయొకతె. ఇట్టివారేనా యం

పురకాంతలు ! వారిచే నీవుమన్ననలు పడయుటకంటె నాచే నీవు తన్నులుపడుట నీకు గౌరవము. అర్థములేని మొగముతో వాచూపేమి? కొట్టెదనంటివి. కొట్టవేమి? (నవ్వుచు) మెడలో గాసులపేరు పెట్టిన వాఁడు కన్నెఱికపువిటుఁడు. తలపైఁ గఱ్ఱపెట్టు పెట్టినవాఁడు కాసాభటుఁడు. కానీ !

మా—ఓసి ! మొుండిముండ! నాకుఁ గోపముపోవ నవ్వువచ్చు చున్నది. నీవెవతెవే ?

సుం ద—సిగ్గులేనివెఱ్ఱిమొగమునకు నవ్వేసింగారముకాదా ? మాఘుఁడా ! నీవుకోపమును విడువుము. నీతోఁగొన్నిసంగతులు చెప్ప వచ్చితిని. నేఁ జెప్పునట్లుచేసితివేని రాజుగారికభీష్టసిద్ధియగును.

మా—కానిముందు నీవెవతెవో చెప్పుము.

సుం ద—నడువీథిలో మనమిటమాటలాడుకొనుట బాగుగా నుండదు. అదిగో ! ఆవేఁపచెట్టునీడకుఁ బోవుదమురా ? (చేయిపట్టు కొనును.) (వేపచెట్టునీడకుఁబోవుదురు.)

మా—నేనువచ్చెదను చేయివదలుము. కాని నీమాటలేవో త్వరగఁ జెప్పవలయును. రాజుగారిచేఁ బ్రేరితుఁడనై యొకసాహస పుఁ బనిమీఁదఁ బోవుచున్నాను. (తలతడిమిచూచుకొనును.)

సుం ద—(తనలో) అమ్మ ! ముండకొడుకా ! తలకడుముకొను చున్నాఁడా? అక్కడనున్నదా ? (ప్రకాశ) రాజుగారికి నీతోఁగలుగు పని రహస్యపుఁబనియని వేఱచెప్పనక్కఱలేదు. లోకములో నేయు ద్యోగికైన రహస్యమని బహిరంగమని వ్యవహారములు రెండుండును గాని—నీకట్టిది లేదు.

మా—అబ్బ ! వృథాకాలయాపనమేల ? శీఘ్రముగఁ జెప్పుము.

సుం ద—సావధానుఁడవైవినుము. నీవు రాజునకు ముక చెలికాఁడవు కాదా ?

మా—ఇప్పటినుండియా ? ఇఱువదేండ్లనుండి—మా బాబునకు బుద్ధి జీమకాలంతవచ్చినప్పటినుండియు.

సుంద—ఆమాటకేమిలే. కాని—నీకని వనితానుసంధానమే కాదా ?

మా—ఆ ! అట్టిదే.

సుంద—ఇంతకాలమునుండి నీవీవృత్తిని నిరాఘాటముగాఁ జేయుచుంటివికదా నీకేమైనఁ దెలివి తేట లి దునఁగుదిరినవా ?

మా—బుద్ధియొకనిసొమ్మా ? ఎక్కడికి ? కుదిరినంతవఱకుఁ గుదిరినది. కాని నీకీగొడవయెందులకు ?

సుంద—నాకుఁ గావలసియుండియే యడిగితిని. మాయచే నేమి—బలాత్కారముచే నేమి—మాయమ్మగారిని మీరాజుగారు తెచ్చిరికదా ? తెచ్చియాదయ్యాలకొంపలో నన్నికట్టులకులోఁబఱచి పెట్టిరికదా ? ఇదివఱకుఁ గొన్నిసారులామెతో మాటలాడుటకు నీవు వచ్చితివికదా ? ఆమెను మీరాజుతో సంధానపఱుపఁగలిగితివా ?

మా—ఆఁ ! ఆఁ ! నీవు క్రొత్తరాణిదాసివా ? నడనడ! రాజుగారియొద్దకు. నీగొంతుఁగోయింతును. పైవారులోనికి రాకుండ లోనివారు పైకిరాకుండ నెన్నికాపులుంచినను నీవెటులో బైటబడితివా ? నడనడు! రాజు నిన్నుఛప్పాపాతర వేయించును.

సుంద—నాయభిప్రాయము తెలియఁగకుండమాటలాడుచున్నావు. మీరాజునప్రసిద్ధికే నేను బ్రయత్నించుచున్నానని నీకుఁ జెప్పలేదా ? ఆమెనన్నిబంధములలోనుంచినారు. మంచిదే నేనువీధిలోనికివచ్చినెడల ఆసంగతి యెవ్వరికైనఁ దెలిసిపోవునని యో, నాచేనేమైన యుత్తరము తనవారికి లేఖాశాలలో వేయించునని యో, నన్నే మీరాజు పట్టపుదేవియొద్ద కామె పంపి రాజునల్లరిచేయించునని యో, ఈ వృత్తాంతమపూర్వోత్తరము లామెకు నాచేఁ దెలియునని యో మఱియే కార

ణమునకో మాకిన్ని బాధములఁ గల్పించినారు. బాగుగనేయున్నది. ఆమెను లాలించి వశపఱచుకొందురా? బంధించి వశపఱచుకొందురా? స్త్రీవశ్యమున కిదియేనా మార్గము? ఈయమర్యాదతో నామె యింటికిఁబోవుటకుఁగాని, ఈవార్త తనవారికిఁ దెలియఁజేయుటకుగాని బొత్తిగ నిష్టపడక జరుగవలసినరీతిని జరుగునని నిశ్చయపఱచుకొని యున్నదిగదా! అట్టిచో నామెను బుజ్జగించి రాజుతో సంధానపఱచిన యెడల నామె క్షేమము పోవునే-రాజుగారికోరిక తీరునే. ఆమె కెన్నాళ్లీచింత? రాజుగారి కెన్నాళ్లీవంత? వృథగ నడుమనూఁగులాడు నీకెన్నాళ్లీ బాధ? ఎందుకొఱకుఁ దెచ్చితిరో యది త్వరగఁ దీర్పవలయును గదా! అట్టి సంధానము నీవలనఁ గాదయ్యెను. మారాణిబాధను జూడలేక నీకు నేనింతులకుఁ దోడ్పడవలయునని నీతోఁ జెప్పుటకుఁ జచ్చిచెడి వెలుపలికి రాఁగ నీక్షేమము కూడ నెఱుఁగకుండ నట్లు గింజుకొనెదవేమి?

మా—నాకిన్ని తెలియవు. నీవెట్లు వెలుపలికి వచ్చితివి?

సుంద—ద్వారరక్షకుల కొంపలుగూడ నేల తీసెదవు? పాపము! బీదవాండ్రు.

మా—మీయందఱకొంపలఁ గూల్తురు. నడు నడు. రావేమి?

సుంద—ఇంత మంచిమొగమెఱుఁగని మూఢుఁడవేమి? మీకుపయోగించునట్టి—

మా—నేను మూఢుఁడ నగుదునో-కానో; కాని, నీవు కన్నపుదొంగలలో నగ్రగణ్యవు.

సుంద—(తనలో) ఇచటకుఁ దల తడిమికొంటివి కాని, యీసారి నేలఁ గొట్టుకొందువుకాని—(ప్రకాశ) తార్పుడుకాఁడా! నీవన్నమాట నేనేల కాదనవలయును? నేను దొంగలలో నగ్రగణ్యను. (సైచేయి పైబట్ట లాగికొనను.)

మా.—అయ్యయ్యో! నాబట్ట—నాబట్ట—నాకిమ్ము. ఈయవా? హాం! (కలియఁబడి లాగికొనఁబోవును.)

సుంద.—పో! దూరముగఁ బో! ఆఁడుదానిమీఁద నడువీధిలోఁ జేయిచేసికొందువా? జాగ్రత్త! దాసినైననేమి లోకువయనుకొంటివా? నీనుగతనము మండ! నీవు నామీఁదఁ బడి పైఁట లాగఁబోవఁగ నేను నీనెత్తిగుడ్డలాగుట తప్పా? మాట మాట యని వేఁపచెట్టుక్రిందకు నన్ను లాగి మీఁదఁబడెదవా? పశువా! నన్నిట్లు చేసిన నీమానప్రాణములు దక్కనిచ్చెదనా? ఓ పెద్దమనుష్యులారా! రండు. ఈచండాలుఁడు—

మా.—అయ్యయ్యో! అంత గట్టిగ మాటలాడవలదు. పెద్దమనుష్యులు వలదు; పిన్నమనుష్యులువలదు. నాబట్ట నాకిమ్ము. అబ్బ! త్వరగ నిమ్ము. నిన్ను బతిమాలుకొందును. అదేమి దానిలో నేదో తడుముచున్నావేమి?

సుంద.—నీబట్ట నేనేమి మ్రింగెదననుకొంటివా? ఇదిగో! బట్ట వేసికో యింక నెత్తినిముసుఁగు. (బట్టకొనయందలి మూటనున్న లేఖను దీసికొనును.)

మా.—బట్టకాదే! అదే! అదే! అది యీయవే! అయ్యయ్యో! అదే! (నెత్తి నోరు కొట్టుకొనును.)

సుంద.—కొట్టుకో! బాగుగాఁ గొట్టుకో! ప్రభువుల పాదసేవ జేసి బ్రతుకవలసిన నిక్షేపమువంటి కులవృత్తికంటె సానులఁ దార్చుట యధిక గౌరవమని యిందులో దిగితివని కొట్టుకో! ఇరువదేండ్లనుండి యీవృత్తి చేయుచున్నను నింకనుగూడఁ జచ్చుచుండకొండుక నైతివని యొకమారు కొట్టుకో!

మా.—నేను జచ్చుచుండకొడుకను. నాకేమియుఁ జేతఁగాదు. అయ్యయ్యో! అదేమి? ఆకాగితమును నలిపివేయుచుంటివా యేమి

నా ప్రాణమంతయు దానిలో నున్నది; నన్నుఁ జంపక యది నాకిమ్ము. ఇచ్చెదవా లేదా? దొంగముండ! బతిమాలినకొలఁది బిఱ్ఱబిగియుచున్నావు. హా! (మీఁదికి వచ్చును.)

సుంద — మీఁదిమీఁదికి వచ్చుచున్నావు. జాగ్రత్త! నీకు నేను జడిసెద ననుకొంటివా? నీశక్తి నేనెఱుఁగనిది కాదు. ముసలిముండకొడుక! సాగఁదీసి తన్నినయెడలఁ గోటకందకములోఁ బడెదవు. బ్రదుకుపై నాసయున్నయెడల దూరముగఁ బో!

మా — (సఖేదము) అహహా! ఓసి! వెఱ్ఱిదానా! ఊరక బెదరించితినిగాని యాఁడుదానిని జేయిచేసికొనునంతటి యవివేకినా? అందులో-మనకు కావలసినవారముగూడఁ గామా? ఇదిగో! నీపుణ్యామాయని బ్రతికెదను. పెద్దవాఁడను. నీవు చెప్పినట్లు బుద్ధిలేక యీ కూలిపని చేయుచుంటిని. ఆలేఖ రాజుగారు క్రొత్తరాణికివ్రాసి నాచేతికిచ్చి యామెకుఁ జూపించి తిరుగఁ దనయొద్దకుఁ దెమ్మనినారు. నా కొంప కూలిపోవును. నాయుద్యోగము పడిపోవును. నాగొంతు తెగిపోవును. నన్ను రక్షింపుము. నీవేది చెప్పిన నది చేసెదను, —

సుంద — మా రాణిగారియింటికి నీవు వెళ్లుచునేయుంటివికదా! రాజుగారి యభిప్రాయమేమో నీవామెతోఁ జెప్పనేచెప్పుదువుకదా- రాజుగారీయుత్తరమేల వ్రాయవలయును?

మా — నేనిదివఱకు నాలుగుదినములనుండి పడవలసిన యిక్కట్టులు పడుచునేయున్నాను. నీవు కూడఁ జూచుచునేయుందువు. నేను జెప్పినమాట లేవియు నామెవినదే! నేనిటువచ్చుసరికిఁ దానట్టె పోవునే! నామాట వినినయెడల నేదో కొంత గ్రంథము చేతనైనలోఁ బెంపఁగలను గాని వినికియే శూన్యమైనప్పుడు నేనేమి చేయఁగలయును? అందుపైఁ బ్రాణములిసిఁగి రాజుతో నీసంగతి చెప్పఁగ, నా

యున యీయుత్తరమిచ్చి యామెకుఁ జూపుమనినాఁడు. లౌకికుఁడు కావున నెందులకైన మంచిదని లేఖను దిరుగఁదెమ్మనినాఁడు.

సుంద — లేఖయేల ? ఆయనయే మారాణిగారియొద్దకు విచ్చేసి తన యభిప్రాయము నేల వెల్లడింపకపోయెను ?

మా — ఆమె యెవతెయో యుత్తమక్షత్రియకన్య కావున నామె యంగీకారము మొదట నొందకుండ నామెయెదుటఁ బడుటకు రాజు జడియుచున్నాఁడు.

సుంద — ఆమెను రాజాంతఃపురములో నుంచక వేఱుగ నొక యింటిలో నుంపనేల ?

మా — ఆమెనుగూర్చి యన్నియు వేఱువేఱు నేర్పాటులను రాజు చేయుఁదలఁచినట్లు కనఁబడుచున్నది.

సుంద — నీవు భ్రమపడుచుంటివి కాని — మారాణినిగూడ నీమందలోనికిఁ దోలిపెట్టుననియే నానమ్మకము.

మా — అట్లనుకొనవలదు. మీరాణియున్నచోట మఱియొక కోట బయలుదేఱును. మీరాణిని విధ్యుక్తముగా మారాజు వివాహము చేసికొనును. ముందు జరుగవలసిన విశేషము లెన్నో కలవు.

సుంద — సంతోషమే. మారాణిని గట్టుకొన్నతరువాత మీ రాజున కన్నియాటలు చల్లారునులే. కోటలో నిప్పుడున్న వంకకొప్పుల జాఱుపైఁటల దండునకు వెంటనే విడుదలయగునులే. మారాణి మిగుల గడుసుది. అసాధ్యురాలు ! కాని మాఘుఁడా ! ప్రస్తుతరాజ్ఞి యెట్టిది ?

మా — ఇందుమతియేనా ? జ్యేష్ఠ — పట్టి పెసరపప్పు. సుద్ధ పెద్దమ్మ.

సుంద — ఆమె యట్టి లోఁడుగగుటయే మనకు మేలుఁగుగాదా?



మా—కాదా మఱి? కాని—ఆ చెప్పుముక్క— నా మొగము మీఁదఁ బాఱవేయవా ?

సుం—రాజుగారియాజ్ఞకు వ్యతిరేకముగ నేను వెలుపలికి వచ్చితినని యాయనతోఁ జెప్పి నాగొంతుఁ గోయింపవుగద ! ద్వారరక్షకుల కొంపలు గూల్పవుగద !

మా—ఎంతమాట ! ఐనయింటికాసాబిడ్డఁ డట్లుచేయునా ? తప్పు కాదా ? మాతాతసంగతి నీవువినియుందువు. ఏదోచూచి రాజుగారిచ్చినదేదో తీసికొనుటయే కాని కనుచాటున స్వతంత్రించి యొక్క ప్రాఁత బట్టమీఁదఁగాని, యొకపండుమీఁదగాని యెట్టిచేయైచియెఱుఁగడు. మాజాతిలో నతఁడు సర్వహరిశ్చంద్రుఁడు. ఇతరులవంటి యల్లరిచిల్లరి సంప్రదాయములలోనివారము కాము. మాతాతగారిపేరిటివాఁడనే నేను. కాని—నీ పేరేది ?

సుం—సుందరి.

మా—సెబాస్. పేరికిఁదగినరూపమున్నది. రూపమునకుఁదగిన తెలివియున్నది. తెలివికిఁదగిన తెగనీలుగున్నది. దానిమించినదొంగతనమున్నది. అవతారస్వరూపమువలెను న్నావు. సుందరీ ! ఒక్కటే మాట ! నీతో నాలోచింపకుండ నేపనియుఁ జేయను. ఇదివఱకుఁ జిరకాలమునుండి యుదేపఁగఁ బరిశ్రమము చేయుచున్న విద్యయగుటచే నంతకుఁదగినపాండిత్యమే లభించినది కాని కల్పనకుదరలేదు. నీసాహాయ్యము నాకున్నయెడల దిగ్విజయమును చేయుఁగలనను ధైర్యమున్నది. చూడు. ఈకృత్యముచేయు నాకుదినదినముగండమే. ఏనిముసమెవతను సమకూర్పలేకపోవుదునో యానిముసముననే రాజాగ్రహము. వెను కఁగూర్చిన కూర్పులన్నియు గోదావరిలోఁ గలియవలసినవే. [?]దుకు మిగులనస్థిరముగ నున్నది. సుందరీ ! క్రొత్తరాణినిగూర్చి నీవు నడువుమన్నరీతిగా నడచెదను.

సుంద—ఉత్తరమిచ్చితివా! తీసికొందువా ?

మా—ఆ! తీసికొనవలసినదే—కాని—ఏమో! ఎందులకు? అదిమీరాణిగారికేకదా! ఆమెకు నీవేమూపించితి—అయిన నెందు కులే? నా చేతికేయిమ్ము.

సుంద—నీయిష్టమెట్లోయట్లే కాని—రాజుగారికి మనస్సు త్రిని గూర్చి చెప్పుటయెందులకు ?

మా—అబ్బే! దానియగత్యమేమున్నది? అయినను వీలు వెంబడి నాలోచింతును—దాని కేమికాని—మఱియొక—

సుంద—అదేది ?

మా—నాకు సిగ్గువేయుచున్నది.

సుంద—ఏమియుసందేహింపక చెప్పుము.

మా—నీవు పడుచుదానవై పోయితివి కాని—నాయీడుదాన వేవైయుండినయెడల రాజవివాహపురాణములో నేదో కొంతయు పాఖ్యానధోరణితోఁ గొంతగ్రంథము నడిపించియుందును.

సుంద—ఆలాగా? మాయింటిలో నీకుఁదగిన వయసుగలదాసి యున్నది. దానినిగట్టుకో.

మా—ఔను. నేను మీయింటను తెవతెనో చూచినట్లు జ్ఞప్తి యున్నది. అదియెవతె ?

సుంద—సరే. పెండ్లికూఁతురు నీకంటఁబడినదా? ఎక్కడ?

మా—గాబుప్రాయ్యయొద్ద.

సుంద—ఎంతవయసుదివలెఁ గానఁబడినది ?

మా—నిడివిమీఁదగాని దృష్టిబాగుగా నాసదు. ఎట్లుచెప్పఁ గలను ?

సుంద—నీవెప్పుడును దానిదగ్గఱకుఁబోయి గ్రుడ్లుకదలుచున్న వో లేదోచూడలేదా ?

మా — అటులడుగుచున్నావేమి ?

సుంద — నీవు నిజముగా దానినిగూర్చి యెఱుఁగనేయెఱుఁగవా?

మా — అబ్బే !

సుంద — నాతోడే !

మా — నీతోడే.

సుంద — మొదటిరోజున మాయింటికాపురికొఱకు మీరుంచిన ముసలిదనుకొంటిమి.

మా — అది మీతోవచ్చినదికాదా ?

సుంద — చెప్పెనదివిను. గాబుప్రొయ్యియొద్ద నదికాళ్లుకాచుకొనుచుండెను. మాయమ్మగారి దంతధావననిమిత్తము వేఁడినీళ్లను దెచ్చుటకై యటకుబోయిదానిమొగము పరీక్షించిచూచితిని. గుడ్లు తిరిగినట్లు కనఁబడ లేదు. అదిగాక దేహము గాజువలెనుండెను. లోని కోశములు కనఁబడికనఁబడనట్లు కానఁబడెను. నాకొడలప్పుడు జలదరించెను. నాయొద్ద నెవ్వరును లేరు. చేతిలోనిచెంబుదానిపైఁ బడవైచితిని. గప్పునని యదిమాయమయ్యెను. కెవ్వుమని నేనొక్కకేకవైచి కొయ్యనైతినఁట !

మా — అమ్మయ్యో ! నిజముగానే?

సుంద — దయ్యాలకొంపయని నీతో మొదటనే చెప్పలేదా ?

మా — ఇఁకఁజాలు. ఇఁకమీయింటి కొక్కటేనమస్కారము. ఇదిగో! ఈయుత్తరము నీవేతీసికొనుము. (ఇచ్చును)

సుంద — అయ్యయ్యో ! నీవురాకుండినసెట్లు? ఈదిక్కుమాలిన భయమువలన నీవు రా మానివైచినయెడల మాబ్రతుకు లడుగనక్కఱలేదు.

మా — నేనువచ్చుట యెందులకు ? రాజుగారియాజ్ఞయో లేఖయో నీయొద్దకుఁ జేర్చెదను. అదినీవు మీరాణిగారియొద్దకు

జేర్పుము. భూతమనఁగ మాత్రము నాకావైపుబుద్ధిమెక్క దు. నామే నమూమ నొక కామినిపట్టి పిల్చిపిప్పి చేసినది. అతఁడాలాగే మొగిరిపోయి నాఁడు. పెద్దవాఁడను. నీపుణ్యానూయని బ్రిదికియుంకున. నేనురాజు నకు వేడుక చెలికాఁడనైనట్లు నీవునాకు వేడుక చెలికత్తెవు.

సుంద—అటులైన మాయమ్మకి లేఖయేదో కనబఱచి యామె యభిప్రాయమేదో చెప్పుమందువా? నీవెప్పుడు నాయొద్దకువచ్చెదవు?

మా—మీయింటివలకైననిఁక రాఁదలఁచుకొనలేదే! నాలుగు బారలప్రొద్దుండఁగ నేనివేఁపచెట్టుకిందికివచ్చెదను. మఱ్ఱిచెట్టుక్రింద గౌతమునకు బుద్ధత్వమువచ్చినట్లు వేఁపచెట్టుక్రింద మాఘునకు నీతో మిత్రత్వమువచ్చినది. ఇదే మనసంకేతము.

సుంద—సరే. పొమ్ము. (ఇద్దఱుఁ నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

శ్రీరామా.

# ముద్రిక.

---

## తృతీయాంకము.

---

ప్రదేశము—వీధి.

ప్రవేశము—సుందరి.

సుంద—(చప్పటులు జరుచుచు) మాఘుఁడా! ఇటు; ఇటు.

మా—(ప్రవేశించి) ఇంత సేపటినుండియు నీవేఁపచెట్టుక్రిందనే కనిపెట్టుకొనియుంటిని. ఊరకే కూరుచుంటినిగాదా? ఒక్కఁడనే కూరుచుంటినిగాదా? అందుచే రవంత కునికిపాటులురాఁగ నిప్పుడే పొడుముపట్టుకొనుటకటు పోయితిని.

సుంద—నిద్రనాఁపుటలోఁ బొడుము పట్టుకంటె నెత్తిపై మొట్టు మంచి పరమహంసక్రియ. (మొట్టును.)

మా—అమ్మా! నీసిగఁదరుగ! సహస్రారకమలము విచ్చునట్లు కొట్టినావు.

సుంద—సాయంసంధ్యవేళఁ గూరుచుండి కునికిపాటులేమి? దరిద్రస్వరూపమువలె నున్నావు.

మా—ఇఁక నకు దరిద్రతయేమి? ఇదిగో! నాలక్ష్మీదేవిపరక!

సుం—ఇదిగో! నీమహారాజపత్రము. (లేఖ మీఁదఁబడవైచును.)

మా—మీయమ్మగారికి దీనిని గానఁబరచితివా?

సుంద—చెప్పునదొకటి—చేయునదొకటియునా ?

మా—ఏమైనది ?

సుంద—కాదగినదేదో యదే.

మా—ఒప్పుకొనినవా ?

సుంద—రాణిచిత్తము దాసిచేతిలోనిది కాదా ?

మా—ఆమాటకేమిగాని-నాజుట్టు రాజుగారిచేతఁ బడకుండఁ నిప్పటికి రక్షించితివి.

సుంద—ఎట్లు ?

మా—నిన్నుఁజూచి పోయినతరువాత రాజు నాకొఱకు నాలుగువార్త లంపినాఁడు. వెళ్లితినన్న యెడల నేమైనదనియు, లేఖ యేదనియు నడుగును. వెళ్లలేదనినయెడల నింత యలత్యమేల యని తల పగులఁగొట్టును.

సుంద—అప్పు డెట్లు దాఁటుకొంటివి ?

మా—సన్నిహితబంధువున కెవరికో ప్రాణముమీఁదికి వచ్చుటచే నేమియుఁ దోఁపక యేదో మూలికకొఱకై పోయినాఁడనియు, సాయంకాలమున రాజదర్శనమునకు వచ్చుననియు భార్యామూలకము గఁ దెలియఁబఱచి కడచుటింటి యటుకమీఁదఁ గూరుచుంటిని. ఈదినము గండముగడచినది. నీవు నాసహసంధానచారిణివై యుందువు గాన నిఁక నాకు భయములేదు. తుదకొప్పుకొనఁజేసితివా ? ఎంత గట్టిదానవు !

సుంద—ఒప్పుకొనఁజేయుటయే కాదు. ఈరాత్రి యుద్యానవనములోనికి వచ్చునట్లు కూడ నేర్పాటుచేసితిని.

మా—ఆఁ ! నిజముగానే ! నిజముగానే !

సుంద—నిన్నుఁ జంపుకొంచ తినినట్లే.

మా—ఈరాత్రియే.

సుంద—ఆ!

మా—ఎన్నిగంటలకు ?

సుంద—రెండుయామముల నౌబత్తు వేయుసమయమున.

మా—సెబాస్ పిడుగా ! ఎంతపనిఁ జేసితివి !

సుంద—ఇదివఱకేమైనది ? ఇఁక ముందున్నది.

మా—నీ వేమి చేసినను జేయఁగలదానవే. చూడు. సుందరీ ! రిక్తుఁడను. పెద్దవాఁడను. కుటుంబికుఁడను. అంతవారమగునెడల—ఆ మూఁడుముళ్ళకాలమందు ఏదో యొక్క భూమి—ఏవి !—ఈనామముగా—మారాజుగారు నన్ను లక్ష్యపెట్టరులే—మీయమ్మగారితోఁ జెప్పి—ఈవృత్తిలోఁ దిరుగుచున్నానని—ఏది—వ్యవహారజ్ఞానము లేనివాఁడను గానుసుమా ! రాచయొఱుగులు దిద్దఁగలవాఁడను. ఇంతేకాక పంచ కావ్యపరిచయము కొంచెముగాఁ గలవాఁడను. దానిమీఁదటఁ దెలుఁగులలోఁ గొంత సాహిత్యము కుదిరినది. ఆపైన మాతాతగారిపద్ధతిగా జననీకటాక్షమువలనఁ జల్లని కవనధోరణి కొంత పట్టుపడినది. ఇదిగో ! నీవు చేయు నుపకారమునకు నీఋణము, మీఁద నుంచుకొనువాఁడను గాను. సుందరమాఘమను శృంగారప్రబంధమును జెప్పి నీకాచంద్రార్కమగు కృతి నిచ్చెదను

సుంద—ఇదివఱకున్న మాఘకావ్యమునుమీఁద నది పైపెట్టు కాఁబోలునేమి ?

మా—అబ్బో! నీకుఁ గావ్యపరిచయము బాగుగానేయున్నదే!

సుంద—నామాటకేమి కాని—నిజముగా నీవు కవిత్వముకట్టఁ గలవా ?

మా—ఎన్నియేండ్లపు లేఁకవని యిందులో దిగితినా? సన్యాసయ్యగారిశిష్యుఁడనై మొదటఁ గొంతకాలము యోగాభ్యాసము చేసితిని. అది బెడిసికొట్టుటచేఁ దరువాతఁ బొగచుట్టలవర్తక మారంభించితిని. దానిలోఁ బెట్టుబడి కిట్టకపోవుటచే నింతకంటె సుఖమైన జీవనము లేదని కవిత్వములోఁ బడినాను. కాని, గణసంధానబాధపడలేక రసికాహ్లాదకత్వమున సమీపవృత్తియగుటచేత గణికాసంధానములోనికిఁ జప్పునఁ దప్పుకొన్నాను. కాని—చప్పున నేను గోటలోనికిఁ బోకుండ నెడల నామానప్రాణములు తక్కువు. పోదునా?

సుంద—మంచియొక్కమాట. మొదటిరాత్రికావున మిగుల లజ్జచే మారాణిగారు రాజుగారితో నేమియు మాటలాడరు. ఆమె పక్షమునఁ జెప్పవలసినమాటలన్నియు నేనే చెప్పుదును. ఈరాత్రిమట్టునకే యీనియమము. ఈసంగతి రాజుగారితో—

మా—ప్రతిరాత్రి మీనియమమున్నను నాతనికి బాధలేదు ఆతఁడట్టి మాటలసరసుఁడుగాఁడు.

సుంద—ఇఁక నీవు పోవచ్చును. రెండుయామముల వేళ రాజునుద్యానవనములోనికిఁ దీసికొనిరావలయును.

మా—ఉద్యానములో నెచ్చటఁగసపెట్టుకొని యుండవలయును?

సుంద—తెలివిమాలినప్రశ్న మడిగెదవేమి? నేనావనము చూచితినా? నాకెట్లు తెలియును? మీ రెచ్చటనుండుఁడన్న నచ్చట నుందుము.

మా—సరే. కొలనిప్రక్కను వేదిక యున్నది. చూచుకొని యటకురండు వనబహిర్ద్వారమును దెఱచి యుంచెదను.

సుంద—సరే.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

# తృతీయాంకము.

---

ప్రదేశము—ఉద్యానవనము.

ప్రవేశము:—మేలుముసుఁగుతోనిందుమతి; సుందరి.

ఇందు—సుందరీ! నీకిదినూతనప్రవేశము. నిమ్మళముగరమ్మా.

సుంద—అమ్మా—మీకీచర్యలో నూతనప్రవేశము. భద్రముగఁ బ్రవర్తింపవలయును.

ఇందు—నిజమే. నీబుద్ధివిభవమును జూచి నేనిందు దిగితిని. నీ ధైర్యముతప్ప నాకిఁక నేమియులేదు. ఇదివఱకు సమర్మకమగు సంభాషణమే యొఱుఁగని నేను జిమ్మచీఁకటిలో నర్ధరాత్రమున నుద్యానవనములో—మేలుముసుఁగుపైఁబెట్టుకొని దుర్మార్గురాలివలెఁ జేటికాసహాయమున్నై మాఱువేసముధరించి యిల్లుదాఁటితిని. ఇఁకరాజునుగూడ నెదురుకొనవలయునుగాఁబోలు! హా! ఎంతగతిపట్టినది. ఎంతసేపటిలోఁ జుక్కవతెరాలిఁబడిపోయితిని! నాకుగుండెలుకొట్టుకొనుచున్నవి. కాళ్లు వణఁకుచున్నవి.

సుంద—అమ్మా! వెఱదీఱకు నెంచుచున్నారా?

ఇందు—నాదుర్గతియిట్టులున్నదని నీతోఁ జెప్పితినికాని యింత వఱకువచ్చిన పిదప వెనుకాడెదనా? నేను దొంగచూపెప్పుడైనఁ జూచితినా? ముఖప్రసన్నత నెప్పుడైన మేలుముసుఁగుచే మాటుపఱచితినా? మగనితో మాఱుమొగమున నెన్నఁడైనమాటాడితినా? మానసమునకు మొగమువిధేయముగనుండునట్లెప్పుడైనఁ జేసితినా! హుఁ! ఇప్పుడు

నాతనునాపాదమస్తకము మాయాపూర్ణమైయున్నది. ఇదిగాక, సానివలెఁ దెగివడి యపాత్రపాత్రాభినయారంభమును జేయుచుంటినిగాదా? ఇతరులు నాయెడఁ దప్పుచేసిరని విచారించితినిగాని నేనితరులయెడఁ దప్పుచేసితినని విచారించితినా? శీలమెంతలో ధ్వస్తమైనది! శిష్టతయెంతలో భ్రష్టమైనది!

సుంద—మీరట్లు విచారింపఁబని లేదు. నేను ప్రోత్సహించి మిమ్మిందు దింపితినని మీరు లేశమైనఁ దలఁపవలసినపని లేదు.

ఇందు—నీవు ప్రోత్సహించితివని నే నంటినా? నే నంత తక్కువమనసుకలదాననా? నేను నిన్నుఁ బిలిపింపలేదా? నీయొద్ద నాసోదె వెడలఁబోసికొనలేదా? నాకష్టనివారణమునకు గతి కనఁబఱుపుమని నిన్నుఁ బ్రార్థింపలేదా? నేనిందులకు మనస్ఫూర్తిగ నొప్పుకొనలేదా? ఇఁక వెనుక దిరుగనని నిశ్చయించుకొనలేదా? ఇందు నీప్రోత్సాహమేమున్నది? నీవంత ప్రోత్సహించుటకు నేనేమి చిన్నదాననా? అజ్ఞురాలనా?

సుంద—అమ్మా! బాగుగ మఱియొకమాఱాలోచించుకొనవచ్చును. ఇప్పుడైనను మించినదేదియు లేదు.

ఇందు—నాయభిప్రాయమేమో నీవెఱుఁగకుండ మాటలాడుచున్నావు. నాప్రస్తుతబాధయేదో గ్రహింపకుండ నన్ను వ్యథానొంచుచున్నావు. సుందరీ! నిజముగా నాబాధ యేదో యెంతయో నీకుఁ దెలియదు. నీవు తెలిసికొనఁజాలవు.

సుంద—ఎందుచేత?

ఇందు—భర్త్రాకర్షణప్రయత్నములు, పరకాంతానిందలు, నక్కటక్కులు, బొల్లిమాటలుఁ, కల్లవేసములు, పొంచిపట్టుకొనుటలు, మొదలగునవి నీకుజన్మసిద్ధములు. నాకట్లు కాదే. నేనొక్కసారి నీయావరణములోనికి దిగిపోవఁగ నామనస్సునకెట్టులున్నదనఁగ నగరుమాన్నె

నమ్మికొనునది పితుకలు చేయు పనిలోదిగినమొదల దానికదియెంత యసహ్యముగనుండునో, సుస్నాతయై పరిశుద్ధవసనధారిణియగు వనిత ప్రియమానమునఁ బాదిగుంటలోఁబడిన నామె కెటులుండునో, యంత కంటెమిగులరోఁతగనున్నది. సుందరీ! పచ్చిశోలుదుర్వాసనావిశేషము బ్రాహ్మణికిఁ దెలియుచుగాని పంచమకన్యకుఁ దెలియునా? నేనిట్టు లాటినని యన్యథాయెంచకుము. నీవునామనస్సునుగనిపట్టలేక మాట లాడుచుంటివని యింతదూరముగ—నింతకఠినముగఁ జెప్పితిని. నానిశ్చి తమునుగూర్చి సందేహింపకుము. చంచలచిత్తనుగాను. ఎటుపోయి యెటువచ్చినను గణించుదానను గాను.

సుంద—ఎటుపోయి యెటు వచ్చినను సిరాశతోఁగూడినమాట లేల? ఆతనికిఁబరకాంతాలోలత యటుపోవును; స్వకాంతాసక్తి యిటు వచ్చును.

ఇందు—ఏమోసుమా చెదముగాక!

సుంద—ఎందఱు కాంత లిట్టిరహస్యవేషముల భర్తలకు బుద్ధి చెప్పి సంసారముల బాగుచేసికొనినారు కారు! వారందఱి తవగచి యిట్టులాందోళనమందిరా? మీగౌరవమున కిప్పుడేమిలోపము కలిగెను? మీమనశ్శుద్ధి కిప్పుడేమిభంగము కలిగెను? మనము చక్కఁ బఱచుకొనవలసిన మనుష్యులను నయమునఁ జక్కఁబఱచుకొందుము; భయమునఁ జక్కఁబఱచుకొందుము. ప్రత్యక్షముగ దిద్దుకొందుము; కనుబొమ్మిదిద్దుకొందుము. బట్టబయలు, చాటుమాటు, నల్లపనులలో వలె దీనిలోఁగూడ నున్నవి. శృంగారశాస్త్రములోనివి యన్నియు, పగలు—వద్దికలు—గమనికలు, విసరులు, తళుకులు, చమత్కార ములు. రాగమునకివియేప్రాణములు; గడ్డముపట్టుకొనియో, జుట్టు పట్టుకొనియో, మణిదీపముల వెలుతురనో, కనుగ్రింతలచీకటినో, మగనిని వశపఱచుకొన్నదియే యాఁడుది. అదియే సుమా ట్కి

నాఁడది. అనుకూలముగ రాజ్యమేలుఁ రాజు భూమికలంకారము. అనాయాసముగ రాజునేలు రాణి ధరణికి ధరణీనాథునకుఁగూడ నలంకారము.

ఇందు— అబ్బ! ఎందులకీ దీర్ఘోపన్యాసము? నీ ప్రశ్నాకింతేనచ్చుఁ జెప్పనక్కఱలేదు. నాకిదికలకేనచ్చినది. నాభర్త చేష్టలవలననే నచ్చినది. సపత్నుల చాటుమాటు దెప్పులవలననే నచ్చినది. ఊరివారి కాకిమాటలవలన నేనచ్చినది. వారిమాటలను నేనంతగ గణింపను. తానెవఁడు? నాసొమ్ము—నాసొమ్మేమి? రాజుగారిసొమ్మేమి? ఇరువదేండ్లనుండి తినినవాఁడు కాఁడా? నావలన ననేకపర్యాయములు బహూకృతుల నందినవాఁడు కాఁడా? నాభృత్యుఁడు కాఁడా?

సుంద—మాఘుఁడేనా?

ఇందు—ఔను. ఆబానిసీఁడు—ఆపలుఁగాకి—నన్నేమనును? నేను బెయ్యమ్మనా? ఊఁ! పెసరపప్పునా? నాకుఁ గలుగుఁదనము లేదా? కాంతునకు లోకువైనంతమాత్రమున నీ కాసామానికిఁగూడ లోకువనైతినా? నాకుఁ గలుగుఁదనమున్నదో లేదో చూడఁదగిన కాలము వచ్చినది. ఆహా! లోకమెంత విధ్వస్తమైనది? ఓరిమిపిఱికితనమా? సత్యము శక్తిహీనతయా? శాంతి చచ్చుఁదనమా?

సుంద—శాంతేమి? చావఁగుట్టలేని పురికోన సాలెపురుగు. తీవ్రత లేని రాజు దిష్టిపిడత. కాంతుని మొట్టలేని కాంత గడ్డిబొమ్మ.

ఇందు—కానీ! కానీ! ఊఁ! రాజుగారు—ఏది?—శాత్త్రరాణికి వ్రాసిపంపిన లేఖలోని యంశములు నీకు జ్ఞప్తియున్నవిగావా?

సుంద—మీరు చూపితిరి కాదా?

ఇందు—అంగములంటివా? కాదు. మాటలేమైన జ్ఞప్తియున్నవా?

సుంద—ఏమ్మాళముగ జ్ఞప్తి చేసికొనినయెడల—అమ్మా!—ఆమాటలు మీకు బాగుగా జ్ఞప్తిలో నుండఁదగినవే.

ఇందు—జ్ఞప్తి లేకేమి? తిరుగ నొకసారి విని కసిదీఱఁ దిట్టవల
యు నని—వారు వచ్చువేళ కాలేదుకాదా ?

సుంద—అటులైన వినుఁడు. " జగదేకసుందరికి—"

ఇందు—ఇతని కవిత్వమా యిది—లేక యది యట్టిదా ?

సుంద—దాని వ్రాసియే సుందరియగునప్పు డది యెంతటిదో
చెప్పవలయునా ?

ఇందు—అంతేనా ? అయిన నేమాత్రపుఁ జక్కనిదో నిమ్మళ
ముగ మాఘునిఁ గనుఁగొనలేకపోయితివా ?

సుంద—అనుమానమున కాస్పదమగుననియా ప్రశంసయే యెత్త
లేదు.

ఇందు—పోనీ ! కన్ను లున్నవానికి—నీతియున్నవానికి—ధర్మా
రణమం దాసక్తియున్నవానికి—గ్రామ్యసుఖవిరక్తియున్నవానికి—
యమదండనభీతియున్నవానికిఁ—దన ధర్మదారకంటె జగదేకసుందరి
కలదా ? అవి లేనివాని కందఱు సుందరులే. జగదేకసుందరులే. ఇష్ట
దైవమిచ్చువానితోఁ సంతుష్టిఁగనక యాచించు కృపణున కందఱు మ
హారాజులే. తరువాత దానేమి వ్రాసెను ? 'నీచరణపద్మదాసుఁడు మ్రొ
క్కి చేసికొను విజ్ఞాపన' మనియా ?

సుంద—అవును.

ఇందు—ఆహా ! ఎంత నీచత ! భార్యకు భర్తయే పరమదైవ
ము. భర్తకు భార్యయు నటులే. అట్టి పవిత్రవిశ్వాసము లేని మగ
నిర్భాగ్యున కాఁడుజంతువు లెల్ల నర్ధశరీరములే. ఆముష్మికప్రదములే.
అద్వితీయమగు పరబ్రహ్మము ననుసంధింప బుద్ధిస్థైర్యము లేని పురుషు
నకుఁ గోడియు దైవమే—కుక్కయు దైవమే—బల్లియు దైవమే.
తరువాత నీశృంగారశేఖరుఁ డేమి వ్రాసెను ?

సుంద—"నీతో నున్నది నా బ్రతుకు."

ఇందు—హుం. మొదటనే యమంగళవాక్యమా ? ఆహా! ఎంతయొడలు తెలియని మాట నాడినాఁడు. నా బ్రదుకు కాతనిలోనున్నది. ఆతని బ్రదుకు నాలోనున్నది. ఐహికపు బ్రదుకులోనే కాదు—ఆము ష్మికపు బ్రదుకులోఁగూడ మాకట్టి యవినాభావసంబంధమున్నది. తరువాత నేమని—

సుంద—"అత్యంతశీఘ్రసమావేశమున కాత్రపడుచుంటిని."

ఇందు—ఇదిగో! అది యీతీరునఁ గానున్నది కాదా? రాజా! ఆయువశిష్ట మిప్పుడే తీర్చుకొందువుగాక! కొత్తరాణిని జూచుటకుఁ గొండంత యపేక్షతో వచ్చిన నీకు—పాపము—పరమనిర్భాగ్యదేవత యగు పాతరాణియే దాఁపురించినది. విందారగింపఁబోయినను మిరి యాలచేరు మెదుకులే సిద్ధించినవా? హుఁ! రాజా! యెంత దుర్మా ర్గుఁడవు. ఎంత విశ్వాసహీనుఁడవైతివి! శాస్త్రముల ననుసరించి—శప థముల ననుసరించి—జగత్కర్తశాసనము ననుసరించి జన్మమున్నంత కాలము నీకు జగదేకసుందరిగాఁ గనఁబడవలసిన నేను—ఒక్కరాత్రి-ఒక్కగడియ నైనను—జీఁకటిని—భ్రమాచ్ఛాదితమగు నీకంటికి "జగ దేకసుందరి"గ నుండవలయునను ముచ్చటతో నిట మహానందోత్సవమున నుంటిని. రా! చేతితో సర్వదేహమును, సర్వచిత్తమును, సర్వాత్మ యును నీయధీనము చేసిన యిల్లాలి యీమాత్రపు మనోరథమును, దీర్ప నీకు న్యాయముకాదా? రా!

సుంద—అమ్మా! నీవు తొందరచే నాతని నేమియు ననఁగూ డదుసుమా! ఈరాత్రి యాతనిహృదయమును బూర్ణముగ విమర్శింత ము. తరువాతఁ దగినప్రతిక్రియ చేయుదమని యనుకొంటిమి కాదా?

ఇందు—కపులో నున్నపుబట్టి యడుకుచున్నది. కానీ— తరువాత నేమని వ్రాసెను?

సుంద—ఇదిగో! జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచున్నాను. "నన్ను నా రాష్ట్రమును—రాణిని నిరంకుశముగ నేలుకొనవలయును." అని.

ఇందు—హా! వికటకోపిక లేకున్నది. అట్లుపైన "చిత్తగింపవలయు"నే కాదా?

సుంద—అదే. "అంతరంమునకుఁ దేవతెను."

ఇందు—చరణదాసానుదాసుఁడైనప్పుడు చిత్తగింపవలయునను టమాత్రము దోషమగునా? ఎట్లు? "నన్ను—నా రాష్ట్రమును—రాణిని నిరంకుశముగ నేలుకొనవలయును" అనియా? "నన్ను" సరే. అతనికర్మము. "నా రాష్ట్రమును" సరే. అది యతనివంశములోని రాజులందఱికర్మము. రాణినిగూడ నేల యేలుకొనవలయును? నన్నేలినఁగాని యాజగచ్చక్రవర్తికి నిరంకుశాధికారము చెల్లుబడి కాదా? నన్నుఁగూడ నేలినఁగాని యాతని "చరణదాసత్వము" నకు సంపూర్ణత సిద్ధింపదా? సుందరీ! నన్నుఁగూడ నేలుకొనుమని యాతఁడు దీనిని బ్రార్థింపనేల? వ్రాఁతరూపమున శాసింపనేల? లోకమున నెచ్చటనైనఁ బట్టపుదేవియే దేవి. మిగిలినవారందఱు బ్రక్కయంగుబొమ్మలే కాదా? ఈలోకనీతి తుడిచిపెట్టుకొనిపోయెనా? పోనీ! పెద్దరాణి చిన్నరాణియను తారతమ్య మక్కఱలేదా? కుడి యెడమభేదమే కూలిపోయెనా? ముందువెనుకలతోఁ బనిలేదా? ప్రస్తావన తరువాత నాందీపూజసేయు నటకుఁడుండునా? ప్రథమపత్రమున నుండవలసిన శ్రీకారము రెండవపత్రమున నుంచిన గ్రంథకర్త నేమనవలయును?

సుంద—అమ్మా! మోహాంధులకు ముందేమి? వెనుకయేమి?

నేపథ్యమున

ముందుంటివా? వెనుకనుంటివా? ఈగాఢాంధకారమున నా భేదమేమియుఁ దెలియుటలేదు. (మఱియొకకంఠరవముతో)

ఆభేదమే కాదు. హెచ్చుతగ్గుభేదము కూడ నశించినది.

ఇందు—పరకాంతల వేఁటకాఁడు బయలుదేరినాఁడు.

సుంద—కుక్కతోఁగూడ—అమ్మా! వారు కొలనుప్రక్క వేదిక పైఁ గూర్చుందురు. కావున వారటకుఁ జేరకుండనే మనమచ్చటికిఁ బోయిన మంచిదికాదా?

ఇందు—వా రేమనుకొందురో వినవచ్చుననియా? నడు.

(ఇద్దఱును వేదికను సమీపింతురు.)

(రాజు సేతుమాధవుఁడు, మాఘుఁడు ప్రవేశింతురు.)

మా—బాబూ! నేను ముందేయుంటిని బాబూ! ఇదిగో! నాకరము గ్రహింపుఁడు.

సుంద—(తనలో) అయ్యో కీక బురుషపాణిగ్రహణమే తగవాయె.

ఇందు—(తనలో) ఆహా! రాజా! విచ్చేసితివా? సివిక చర్య భార్యకుఁగనఁబడుమట కింతశ్రమపడి, గాంధాంధకారము వేంచేసితివా? సెబాస్. నీకుభార్యయందెంతదయ!

సేతు—ఓరి మాఘా! చేయిపట్టుకొననేల? విడువుము. మాకీ దేశము నూతనమా? మాకిట్లువచ్చుట నూతనమా? మాకీవ్యాపారము నూతనమా? కాలచక్రము దేవుని చేతిలోఁ దిరుగునట్లు కాంతాచక్రము మాకంటిలోఁ దిరుగుచున్నది. హా. హా. హా. (నవ్వును)

మా—బాబూ! ఈరాత్రి వెనకటిరాత్రులవంటిది కా బాబూ!

సేతు—ఎందుచేత రా?

సుంద—(తనలో) మేమిచ్చటనుండుటచేత.

మా—మబ్బుదట్టముగఁ బట్టుటచేత గాఢాంధకారము నున్నదికాదా బాబూ!

తు—మబ్బుపట్టనీ వర్షముకురియనీ—పిడుగులుపడనీ—మబ్బునకుఁబట్టువిడుపున్నదికాని మాకాపట్టువిడుపులేదు. పట్టినయెడల నొక్కటేపట్టు—ఎంతపట్టులేనియెడల నేడుకోట్లముల కొప్పులనొక్క పిడికిటిలోఁ బట్టగలము! ఆఁడుదానివశపడుటయు కొను తెలివియేయన్ని తెలువులలోను భింకమైనది. అదియున్నవానికిఁ బ్రపంచమంతయుఁ కరతలామలకము.

మా—మాబాబు భూలోకబృహస్పతి! ఏమిబాబూ!

ఇందు—(తనలో) ఛీ ఛీ!

మా—నిజమేకాని బాబూ! ఈకొత్తరాణి బాబూ! అట్టెట్టులొంగునని తోఁపదుబాబూ!

నేతు—పెంకితనము మాయొద్దనా? అంత తెగనీలిగినయెడల మేము వెనుకముందుఁ జూతుమా? ఆఁడుదాని పెంకితనముచేతఁగాని పందయొద్ద—దయాదాక్షిణ్యము లేడ్చినపిరికివానియొద్ద—మంచిచెడ్డయని మడిగట్టుకొన్న శుంఠయొద్ద—హృదయమనునది యేడ్చిననిర్భాగ్యునొద్ద—ఒకతెపోయినను దానిస్థానమునఁ బదునలుపురఁ జేర్పలేని నపుంసకునియొద్ద—అంతేకాని మనయొద్దనే! హెహె హె! (నవ్వును)

ఇందు—(అపవారించి) ఈయువకతవక యహంభావములో సిగ్గుమాలినయీానశ్వేమి?

సుం—(అపవారించి) అమ్మా! రుచికి లొట్టయెట్టిదో పాచాటతకు వెత్తినస్వట్టిది.

మా—బాబూ! ఈరాత్రి యామె మీతో మాటలాడదఁట. కారణము సిగ్గఁట బాబూ!

నేతు—చూచుమనకుమాటలతోనిమిత్తము లేదు. నేనింతకాలము నుండి చూచుచుంటినిగాని మాటలోఁ బసనాకెక్కడను గనఁబడలేదు.

పిండివంటకుఁ బైవాసనయెట్టిదో మాటయట్టిది. వాసనతోఁ గడుపు నిండునా? నోటఁబెట్టవలయును; నమలవలయును; మ్రింగవలయును. అప్పుడుదానివాఁయి. ధ్వనిరసజ్ఞతయని, వచోరసజ్ఞతయని, గాయకులు కవులేమో తెగనీల్గెదరుగాని రసగ్రహణమునవాఁగు కేవలముఁమందులు. అందుకొఱకే వారినెవ్వరిని మనము చేరనీయులేదు. మాటయనునది శృంగారగ్రంథముఁనకుఁ బైనట్టవంటిది. దానినిజింపిపాఱవైచినను గ్రంథమునకుఁ బ్రమాదములేదు. అదిగాక గ్రంథోపయోగమున ముప్పాతిక బరువుతగ్గును.

మా—బాబూ! మీరొనర్చిన నిర్వచనశృంగారప్రబంధము మిగుల రసపుష్టిగలిగియున్నది బాబూ!

సుంద—(తనలో) రాజా! రసికోత్తమశిఖామణివి! చచ్చిన సంగ్రహార్థముచేత పెయ్యగఁజేసి డాఁచియుంపవలసినవ్యక్తివి.

ఇందు—(తనలో) ఆహా! పశుత్వమింతకన్న నయముగదా! పశువులలో నైననురాగలక్షణము లాలోకములలో నఱపులలోఁ గానఁబడునే! ఆహా! ఈతఁడువట్టినిర్మానుష్యమైన యంత్రమువలె నున్నాఁడే!

మా—బాబూ! ఇదియే వేదిక; సంకేతస్థలమునఁ గూర్చుండుఁడు. ఇచటఁ జెట్లనీడలేకుంటచే మిగులఁ జీఁకటిలేదు బాబూ!

సేతు—వారురాకపోవుటకుఁ గారణమేమి?

మా—ఇంకను రెండుయామముల ఘంటా మ్రోగింపఁబడలేదు. బాబూ!

సేతు—ఈరాత్రి యొకగంటముందుగనే దానివాఁయిఁపవలసినదని నగార్చిలతోఁ జెప్పలేకపోయితివా? నీకుబుద్ధిలేదు. నాత్రొందర యెట్టిదో గ్రహింపఁగలవ్యక్తి నీకులేదు. ఇట్టిరాజకార్యములలో రాయబారి కెంతచాకచక్య ముండవలయును? కాలికి మెఱుపు వేగముం

వలయును. నోటికిఁబిడుగుధాటి యుండవలయును. అస్థానవ్యాపారము లలో నింతజాడ్యమా ? ఇంతసాగుడా ?

మా.— బాబ్ — బాబు. నేనుమిగులఁ గష్టపడి సేవఁజేసికొను చున్నాను. నాలోపములేదు. బాబు ! వచ్చుకాలమింక రాకుంటచే వారు రాలేదు బాబూ !

సేతు— వచ్చుకాలము రాలేదేమి ? నీవుకొంతవైనచప్పుడు కాలము వచ్చునా ? జుట్టుపట్టుకొని దానినిముందునకు లాగఁగలనేర్పునీకేదీ ? నీవు పనికిరావు. నీవు తెలివిగలవాఁడవేయగునెడల మేమింక మఱి నూర్గురనైనఁ జేరఁదీసియుందుము. నీతెలివిలేమివలన మాకెంతనష్టము నుత్సాహభంగమునుగలుగుచున్నదో నీవెఱుఁగుదువా? నీవుపనికిరావు.

మా.— బాబ్ ! బాబ్ ! బాబ్ ! ఏలినవారివంటి నిరంకుశుల యొద్ద — బాబూ ! — నేనుగాకపోయిన బాబూ! — మంత్రి యుగంధరుఁడైన నావశ్యకమున్నదా ? బాబూ ! ఎల్లకార్యములు నిస్సహాయులై మీరేనిర్వహించుకొనుచున్నారు బాబూ ! సర్వకాంతాదిగ్విజయము సహస్రబాహువులతోఁ జేయుచున్నారు బాబూ ! చూపు పాఱిన చెప్పుడైన దూసిపోయెనా ? బాబూ ! తలఁపెట్టినదెప్పుడైన దాఁటిపోయెనా ? బాబూ! మీరాడినదెప్పుడైన మాఱువడియున్నదా ! బాబూ ! మీజన్మకాలవిశేషమది బాబూ ! మీగ్రహబలమది బాబూ! మీపిండపుష్టియది బాబూ ! నేనూరక నిమిత్తమాత్రమని నే నెఱుఁగనా ? బాబూ !

(లోన నౌబత్తుధ్వనియగును.)

సేతు— వింటివా ? వాద్యావశిష్టము తీరినది. ఇంకవారురాలేదేమి ?

మా.— బాబూ ! నే నొకసారి నిమ్మళముగఁబోయి తీసికొని రమ్మని సెలవా ? బాబూ !

సేతు—పొమ్మని సెలవాయనియందువా ? పో. ఎగురు. త్వరగ రమ్మని చెప్పు. తళుకుమను సంతలో రా ! పరుగెత్తు. చూడు ఈతప్పవేటు కాలములో—వెళ్లుట—తెచ్చుట, అప్పజెప్పుట. అంతే.

మా—చిత్తము బాబూ ! చిత్తము బాబూ !

(మాఘుఁడు పరిక్రమించును.)

ఇందు—(అపవారించి)సుందరీ! అతఁడు మనలఁ గని పట్టునేమో ?

సుంద—(అప) అమ్మా ! నేనాతని నెదుర్కొనెదను లే. ఇంకను దొందర లేదు.

సేతు—

గీ. మొగము ముగువఁబెట్టి చెవులు నిక్కఁగను బెట్టి
యూర్పు బిగఁబట్టి గుండెల యులుకుఁగట్టి
యొకని రాకను గనిపెట్టి యుంటకంటెఁ
జండతరమైన బాధ వేఱొండు లేదు.
అందుపై నాఁడుదానికై యుండు మీఁదఁ
గొత్త గడిగొత్త సరిగొత్త కోమలికయి
తేరి తెగటారనట్టి సందిగ్ధదశను
బడుచు వేఁచియుంట యమబాధ కాదె ?
అందుపై నట్టనడురేయి నడవిలోన
నేకతము నిల్వ గ్రుడ్డుల నిరులగిరులఁ
దాటుపడి తూలుసట్లుగ దూర్చివైచి
యుంటకంటెను నరకమింకొండు లేదు.

మా—(తనలో) ఇప్పుడెక్కడకుఁబోదును? వారు బయలుదేరి యేయుందురేమో ! వారిదొక దారి నాదొక దారియగునేమో ! వారి టకువచ్చుసరికి నే నిక్కడ లేకపోయినయెడల మఱింత చెప్పుదెబ్బలు.

సుందరి పుణ్యమాయని బ్రదికితిననుకొంటిని. కాని తోటగుమ్మము నొద్దఁ గనిపెట్టుకొనియుండుము. ఈమూఢున కొక్కటే తొందర. నోటి మాటయింక నోటనుండఁగనే కార్యముగట్టెక్కవలయును. రాచపుండు వలెఁ బ్రాణసంకటముగానున్నది.

ఇందు—(అప) సుందరీ! ఆతఁడీవైపునకు వచ్చుచున్నాఁడేమో కొంచెము ముందునకుఁబోయి కనిపెట్టుము. ఏమియు నగపడుటలేదు.

సుంద—(అప) మనల నాతఁడు కనిపట్టలేఁడు. మీరీ చెట్టు మొదటనే యుండుఁడు. నే నాతని గలిసెదను. (పరిక్రమించును.)

సేతు—(తనలో) ఇంకను రాలేదు. కారణమేమో? రారేమో! వారికొఱకు వెడలిన మాఘుఁడు కూడ మాయమైనాఁడు.

సుంద—ఏమియుఁ గనఁబడుటలేదు. ఎవఁడవు నీవు? మాఘుఁడా!

మా—సుందరీ!

సుంద—నీవు తోటగుమ్మము నొద్దఁ గనిపెట్టుకొని యుండు మని చెప్పితివి కాదా? నీ గొంతుగోయ!

మా—నాకేమి మతియా? వల్లకాడా? రాజుగారు నాగొంతుఁగోయుచున్నారు; ఆమె యేది?

సుంద—ఇఁకఁ జాలించు. కొత్తస్థలములో గాఢాంధకారములో దారిగానలేక గిజగిజ కొట్టుకొనుచుండ—

మా—మా రాజుగా రింతకంటె నెక్కువ గిజగిజ కొట్టుకొనుచున్నారు. ఆమె వచ్చినదా?

సుంద—ప్రాణము విసుగుటచేఁ బోవుటకు సిద్ధముగనున్నది. ఇది మర్యాదయేనా? ఇదేనా మీ కాంతాగౌరవము. ఈమాత్రపు దానికే మీరాజింత లేఖను వ్రాసినాఁడా? చాలులే. నడు నడు! మీ రాజువలదు. రాష్ట్రము వలదు.

మా—సుందరమ్మా! క్షమింపుము. ఈసంగతి తెలిసిన డల రాజు నన్నుఁ జంపును. ఆతనియొద్దకుఁ బోవుదము రండు. ఆమె కనఁబడదేమి?

సుంద—మా రాణిగారు మాటలాడరని స్పష్టముగా రాజుతోఁ జెప్పితివా?

మా—ఆ.

సుంద—అటులైన నడు. అమ్మా! ఇటురమ్ము. (ఇందుమతి వారిఁ జేరును.)

మా—రండు

ఇందు—(అప) సుందరీ! నాకు దడయెత్తుచున్నది. నన్ను గఁబట్టుకొనుము.

సుంద—(అప) నీవిట్టు మనసును దొట్రుపాటు పడనీకుము. ధైర్యమును విడువకుము. లేనియెడలఁ బ్రమాదమున్నది.

ఇందు—(అప) నేను మాటలాడను గాదా? ప్రమాదమేమి?

సుంద—(అప) క్రొత్త దేవతయో, పాత దేవతయో యెంతచీఁకటిలోనైన స్పర్శముచేఁ దెలిసికొనుట కష్టముకాదు. అందులో భార్యనట్లు తెలిసికొనుట బొత్తిగాఁ గష్టము కాగు. రాజు వట్టి మూర్ఖుఁడు. నన్నుఁదగినవాఁడు కాఁడు. తొందరతోఁ గౌఁగిలించుకొనిన యెడల నీవని గ్రహింపఁగలఁడు.

ఇందు—(అప) అందుకొఱకు నన్నేమిచేయుమంటివి?

సుంద—(అప) నేను రాజుచేష్టలు గాఢపరిశీలనముతోఁ గనిపెట్టెదను. నీవు నాచాటుననే యుండుము. నీమెడమ చేతి చూపుడు వ్రేలు గట్టిగ నొక్కిన వెంటనే పాఱిపొమ్ము. నీకీ స్థలమంతయుఁ బాలపరిచితముకదా?

ఇంద—(అప) అబ్బ! సుందరీ! ఎన్నిచిక్కులలోఁ బడితిమి.

సుంద—ఇంతమాత్రమునకే చిక్కా? రాజును సమీపించు చున్నాము. భద్రము.

సేతు—(వినుట నభినయించి) బళే! వచ్చుచున్నట్లున్నారు.

గీ. గొంతుబిగియింపు గలగున గుసలపసలు
దొంగముంగాళ్లటంగ నా కంగుకంగు
లులుకు మాత్రిగంటిపిట్టల కలకలములు
చెవులఁబడి మదిఁబడి యాత్మఁ జెనకెనహహా!
ఇలనుబడిన యాకులగల గలయు గంజి
బిగువుగాగ రాకుచ్చిళ్ల పెళపెళయును
వందెల ఝుళఁఝుళయుఁగూడి యహహా! మదికి
విలవిలనుబాపి కదుకల కలనుగూర్చు;
కిటికిగని హుంకరించు జాగిలముపలెకు
భికిలిఁగని బావురను మాను బిల్లివలెను
గప్పఁగని బుస్సుమను త్రాఁచు కరణినట్టె
మొగిరి గుటుకున దాని మ్రింగఁగఁదలంతు.

(ఇందుమతి, సుందరి, మాఘుఁడు రాజసమీపమునకుఁ బోవుచున్నారు.)

సేతు—రే మాఘా! రావోయి! రప్పింపవోయి! పీఁట వేయింపవోయి! పళ్లెర మెదుటఁ బెట్టింపవోయి! చిత్రగుప్తునోటికి బెడ్డఁగొట్టింపవోయి! పాయసకలశము నోటి కందీయవోయి.

మా—ఇఁక మీయిష్టము బాబూ! రచియించిననాటకను బ్రభువారికిఁ గృతినిచ్చితిని. మీరాడించుకొన్న సరే, పాడించుకొన్న సరే.

సేతు—హాహాహా! (నవ్వును.)

ఇందు—(అప) సుందరీ! ఈతఁడు దౌర్జన్యమొనర్చునేమో? మనము బయటఁబడుదుమేమో?

సుంద—(అప) నేనంటినిగాదా? ఏమియు జడునకును.

సేతు—ఈ మేలుముసుగు పెండ్లికూఁతురుగారా! ఇది దాసియా? అబ్బో! ఇదికూడ మనకన్నుఁ బొడుచుచున్నట్లున్నదే! కన్యతోనిది మనము దక్షిణగా గ్రహింపఁదగినట్లున్నది. వహవ్వా! మాఘా! బుద్ధిమంతుఁడవు. కల్పనయనఁగ నీలాగుననుండవలయును. సెబాస్! ఒకరిని చెమ్మనఁగ నిద్దఱను దెచ్చితివి!

మాఘ—ఈవ్యక్తి నాటిక. అది నాంది.

సేతు—హాహాహా! (నవ్వును) నాందికూడ సుందరముగ యున్నట్లున్నది. సెబాస్! మాఘుఁడా! నాటికతోఁబాటు నాందికూడ మాకే కృతినిచ్చితివి కాదా? హాహాహా! (నవ్వును) మాఘుఁడా! మా యభీష్టమును నెఱవేర్చితివి. సంతసించితిమి.

మాఘ—నెరవేర్చువాఁడను నేనా? బాబూ! మా బాబు వేదపురుషులవలె సంకల్పసిద్ధులు! ఏమి బాబూ!

సేతు—ఇప్పుడు వేదములెందుకోయి! అవి నపుంసకులనెత్తిని గట్టు. చందనములోనికి గోమయమెందులకు? కావలసినది చంద్రరేఖ కాదా? ఇదిగో! నాచంద్రరేఖ. ఇది కావలయును.

గీ. మొదలె చీఁకటి యందు పైపైఁ బాయలుండాని
పైన మేలుముసుగును గూడఁ బూని తేల?
తొలతునా? చూతునా? కనఁబడక యున్న
నేమిలే! ముద్దుగొందునా? దొంగిరియట్లు.

(ఇందుమతి పైకిఁ బోవును.)

సుంద—రాజా! అక్కడనే, ఆఁగు. ముందడుగు పెట్టినయెడల బాగుగా జరుగదు. చేయిచాపి త్రెంపుకొనుటకు నీతోఁటలోని ఫలమనుకొంటివా? గోళ్లతోఁ ద్రుంపి ముక్కునొద్ద బెట్టుకొనుటకు నీయుద్యానమందలి పుష్పమనుకొంటివా? ఏమీ! ఎంత లఘువుగఁ జూచుచుంటివి! జాగ్రత్త! ఈమె యెవ్వరో యెఱుఁగుదువా? ఉత్తమక్షత్రియురాలు; పరమాభిమాన సంపన్నురాలు. అభిమానముకొఱకుఁ బ్రాణము విడుచు నాభిజాత్యసంపన్నురాలు. మీయాట లిట సాగుననుకొంటిరా?

సేతు—(అప) మాఘా! ఇదిమనకు సంధానమున నెక్కుడుగఁ దోడుపడునని నీవు చెప్పియుంటివి కాదా?

మా—(అప) ఈసుందరి వట్టిముప్పేటనారికేళపుముండ బాబూ! పైపెంకుఁజూచి జంకఁదగదు బాబూ!

సేతు—సుందరీ! అట్లైన నేమందువు?

సుంద—ముందునకువైచిన యడుగు వెనుకఁబెట్టుమందును. చేయిచాఁచ వలదందును. వెఱ్ఱివెఱ్ఱి తొందరపడవలదందును. సమయమును గుఱ్తెఱిఁగి దూరమాలోచించుకొనుమందును.

సేతు—సుందరీ! ఆలోచింపకుండ—మంచిచెడ్డ లెఱుఁగకుండ నంతతొందరతో మాటలాడెదవేల?

సుంద—ఆలోచించుటా! అది యెవరికున్నది? మంచిచెడ్డ లెఱుఁగుటా! అదియెవరికున్నది? శాంతియా! అదియెవరికున్నది? ఇదిగో! ప్రభువులకు మీరు చెప్పినవిద్యయే మీప్రజలలో నిట్లుఫలించి ప్రకాశించుచున్నది. నేనుబానిసను గావున నావ్యాపారము వట్టిమాటలతోనే తేలిపోవుచున్నది. మీరు ప్రభువులుగావున మీవ్యాపారము గట్టిచేష్టలలోఁ బ్రజలనుముంచుచున్నది. గురువుగారు నాసనిగూడి

నప్పుడు శిష్యుఁడు జావళిఁ బాడినఁ దప్పా? ప్రభుఁడు ప్రాఁగుబోతైనప్పుడు బానిస వదరుబోతగుట తగదా?

సేతు—అట్లు కాదు. బానిస నోటిచురుకుఁగలది యగునెడలఁ బ్రభుఁడు చేయిచురుకు గలవాఁడగుట తగదాయని పలుకుదుము. జాగ్రత్త.

సుంద—అదియొక్కటి యేమీ యోగ్యతకు మానసహానశక్తికిఁ దరువాయిగనున్నది. ఉఁ. కానిందు వలదన్నవారెవ్వరు? ఏమి ప్రభుఁడవు? ఏమి సరసుఁడవు? ఏమి యింగితజ్ఞుఁడవు? ఏమి లలితుఁడవు! లోకమున నుండు పురుషులు ప్రేమచే—పౌరుషముచే—రూపముచే—ధనముచేఁ గాంతల నాకర్షించుకొనుచుండ మీరా సాధనముల వర్జించి చేతికఱ్ఱచేఁ—గాలిముచ్చెచేఁ గాంతలకు బ్రోగుచేయుచున్నారు. మహాత్మ్యముగారు కత్తిమొనను మతవృద్ధిచేసినట్లు. కఱ్ఱపోటున మీరు సతివృద్ధిచేయుచున్నారు. ఓ! జెబ్బపుష్టిసరసమా—జబర్దస్తి పెట్వోసుడు. మూర్ఖా మదనవిలాసము!

సేతు—(అప) ఛీ ఘూ! ఈ ముండ నన్ను మించినట్లున్నదోయి! ఇదియింత చెడవాగినను నాకుఁ దీవ్రముగు కోపమేరాకున్న దేల?

మా—(అప) బాబూ! అంతయే కాదు. పాగదీసినన్ను కొడ పైఁగొట్టినను నాకు దీనిపైఁ గోపము రాలేదు. బాబూ!

సేతు—(తనలో) కోపము నభినయింతును. (ప్రకాశముగ) నీవెక్కడ? నేనెక్కడ? వదరుబోత! నేను రాజనని మహాగౌరవస్థానమనని కాసంతయైన నాలోచింపకుండ నోటికివచ్చినట్లెల్ల వదరెదవా?

సుంద—గౌరవస్థానమా? జీలుగుబెండునకున్న గౌరవము కాకి యీఁకెకున్న గౌరవము పరకాంతను జూచి పండ్లిగిలించిన ప్రభువునకెక్కడిది? బానిసక్రింది బానిసయైన నాతని నెత్తిపైనాఁడు. చపలత లేని యుప్పరివాని నెత్తిపై మట్టితట్ట చపలుఁడగు చక్రవర్తి నెత్తిపైఁ గిరీ

టముకంటె నెక్కువది. వెకిలిరాజుచేతిఖడ్గము వెట్టిగొల్లని పంగలకఱ్ఱ కంటె నెక్కువదికాదు. కావున గౌరవలాఘవప్రశంస మీరుసేయం దగదు. నావంటిదాసికొఱకు మీరు చేయిచాచినప్పుడీక మీగౌరవత యేలోకముననున్నది ? యాదృచ్ఛికముగ నిప్పుడు మీరీయుత్తమ కాంతను హరించితిరికాని, యిదివఱకు బుద్ధిపూర్వకముగ మీరు చేరం దీసినదంతయుం జేతపెయ్యల బిడారమే కాదా ! ఎట్లైనను బరకాంత ను జపలతతోం జూచుటయొకటి, పరువునర్వాంగకముగ జచ్చుట యొకటియునా ? ఈవృత్తి చేసికొను నాకంటె మీరు వ్యాపారబాహు ళ్యమున నెక్కువయే కాని గౌరవమునసెక్కువ ? దాసినైన నేనే మిమ్ములత్త్యపెట్టనప్పుడు మారాణియైన యీమెనిన్ను గణించునా ? మేమొందఱకైనం దెగించియున్నాము. కావున దూరమాలోచించుకొని మఱిమాటలాడుము.

మా.—(అప) బాబూ ! మదనకళామహామహోపధ్యాయులైన మీకు నేను జెప్పంగలవాండను గాను. బాబూ ! ఏమిరెత్తుగ వచ్చు చున్నదని సందేహింపకేందు బాబూ !

సేతు—(అప)

గీ॥ లలితశృంగారరసనదిం దెలంగుమారు
వక్షృదోంగయూబులు బలుసుక్ష్మనేన్ను
టేంత నెఱజాణ గణియించునే తుపాకి
పిక్కటె గురుగాలి విసరు లెక్కగలదె ?

(ప్రకాశముగ) సుందరీ ! ఆలోచించుకొని మఱిమాటాడుమని చెప్పి నావు. ఆలోచించుకొనుమనంశే మిది కాదు. ఇది బుద్ధితోం జేసిన వ్యవహా రమే కాదు. అట్టెట్లైనయుద్దు లేకుండ నాశుకపిత్వామువలెం బోసీయ వలసినదే ! అంతే కాని యీమాత్రపురాజ కార్యమునకు వెనుకముందు

త్రొక్కులాట యేల? పిల్లి మెడకు గంట కట్టుటకు శకునమేల? దుప్పి త్రాచుపామును నమలి వేయుటకుఁ బ్యాజ్య ప్రశంస యేల? ఇది జన సామాన్యము. సహజము. ప్రపంచచర్యాగానమునకెల్ల నిదియే పల్లవి.

మా—(అప) మా బాబు కంతుసూత్ర కారకులు. కలియుగ వ్యాసులు! ఏమిబాబూ!

సుంద—ఆహా! మనుజత్వము పశుత్వపుమట్టమునకుఁ దిగలాగుటలో నీమిట్టవేదాంతము తొట్టివైద్యముకంటెఁ బ్రబలతరముగ నున్నది. నాయనా! అవతారపురుషుఁడవు! ఇంద్రజాలము! మేము నీ మతములోనికి దిగిపోజాలము. కావున మాకు సెలవొసంగుఁడు.

ఇందు—(అప) ఈసంభాషణము నాకు మిగుల రోఁతగనున్నది. త్వరగఁ బోవుదము రమ్మా.

సుంద—(అప) అమ్మా! తొందరపడకుము.

సేతు—సెలవుతీసికొనుటకే వచ్చితిరా? పోనిచ్చుటకే తెచ్చితినా? అది నట్టికల్ల. కాని నామాటలవలన మీ కాంత బెదరవలసిన పనిలేదు. మా ప్రభావమట్టిదని మాటవరుస కంటిని. పనివచ్చినప్పుడు పర్వతశిఖాగ్రము లాగఁగల యేనుఁగు విలాసముతోఁ బద్మినిని నిపాయముగ నెత్తలేదా? మనకదియున్న దిదియున్నది. ఒకకంట జ్వా——ఒకకంట లీల. ఈచేతఁ జిగిలిబాకు—ఈచేత మొగలిరేకు. అం. ఇటో! అటో! మీరు కావున నింతసేపు మాటలాడుచున్నాను. మాటలలోసారము గణించువాఁడు వట్టిపనికిమాలినవాఁడు.

మా—(అప) ఎంతసేపు మా బాబు శుద్ధకర్మయోగి. ఏమి బాబు!

సేతు—టక్కు టెక్కున నేను జెప్పుచున్నాను. మీ కాంతను విధ్యుక్తముగా వివాహమాడుటకు నిశ్చయించుకొంటిని. కావున నామె నంగీకరింపఁజేయుము.

సుంద—అమ్మా! రాజుగారనుమాటలను వింటిరా? మీయభిప్రాయ మేమి?

ఇందు—(తల యూఁపును.)

సుంద—మాయమ్మ శిరశ్చాలనమున నంగీకృతి తెలిపినది.

సేతు—సెబాస్! ఇఁక నేమి? ఇఁక మేము భార్యాభర్తల మైతిమి. వివాహమనునది వట్టివేడబము. నిరుపయోగమైన తంతుసుమా! ముడిపడవలసినది మనసులోగాని మెడలోఁగాదు. అది టక్కునఁ బడినది. ఇఁకఁ జప్పునఁ గౌఁగిలించుకొనుట కభ్యంతర మేమున్నది? (చేతులు చాఁపును.)

సుంద—(చేతులు త్రోచివైచి) ఆగు. ఆగు. వివాహమే యభ్యంతరము.

సేతు—అది యగునంతవఱకుఁ గాఁగుదరమగునా? ఆఁకలి చుఱుచుఱులాడుచున్నది. ఎదుట బంగారుపళ్ళెరములోఁ బంచభక్ష్యపరమాన్నములతో వడ్డనయై యున్నవి. నోరూరుచున్నది. వెంటనే భక్షింపక పెట్టినవాఁడైన నూరకుండునా?

మా—మాబాబుని యొంతసేపు మాండవ్యమతము. ఏమి బాబూ!

సుంద—రాజా! ఆఁకుదాని మొగము గని వాఁడువలె నంత తహతహ పడెద వేల?

సేతు—ఉన్నసొగసే యది. ఉత్తమపురుషుల కుండఁదగినగుణసంపత్తియే యది. వారిప్రకృతు లనేకరములు. దిగినకొలఁది లోఁతు. తిన్నకొలఁది యాఁకలి! పూడినకొలఁది గోయి! కుందేవు గుఱ్ఱమునకువలెఁ బరుగెత్తినకొలఁదిఁ బౌరుషము. ధారాకవితవలె విడినకొలఁది వేగము. అప్పుల శృంగారమువలె మాది తాటాకు

అశక్తత—అస్తారుషము—ఏమీ? తన కాళ్ళకి సంకెలయా? చేతికి సంకెలయా? చిత్తవృత్తికి సంకెలయా? ఇక మనుజబుద్ధి కుపయోగ మేమున్నది? రసమునకుద్దీపన మేమున్నది? రుచికి వివిధత్వమేమున్నది? మనసునకు స్వాతంత్ర్య మేమున్నది? బ్రతుకునకు సార్థకత యెక్కడిది? చచ్చినదాఁక నొక్క మొగమే కన్నులు లొట్టపడిపోవునట్లు చూచుటా? చేతులకు స్పర్శము చచ్చిపోవునట్లు పట్టిన చేత నే పట్టుటా? ఇఁకఁ జేతినిండ బని యేదీ? ఉన్న నరములకుత్సాహ మేది? వేలువేలు దృష్టుల కవకాశమేది? మనస్సునకుఁ దీఁగయల్లికవంటి కల్పన యేది? అన్నియు నటుంచుము. కాలము గడచు వెల వేది? ఒక గోడమీఁది బొమ్మ వేఱొక గోడమీఁది బొమ్మను జూచినట్లే. అంతటితో నంతఃపుర సౌఖ్యము ననాశ్వాసాంతమే. అట్లుంటకంటె నదియు లేకుండ నుండరాదా? తినవలవచ్చినప్పుడు చేయి యెటుమాత్ర మెందులకు? ఓ! ముప్పదిరెండు కూరలతో, నలువదినాలుగు పచ్చడులతో, నూటపదునాలుగు పులుసులతో దినదిన చిత్రవిచిత్రాతివిచిత్ర రుచులతో విందారగింపవలయును. అంతే కాని యుభయభ్రష్టత్వపుఁ గౌఁగిలింఘనము ఎందులకు?

మా—మా బాబుల తృణము చదువుకొనలేదు కాని కాళిదాసునికంటె గండ్రియైన కవియైయుండును. ఆతఁడు మేఘసందేశ మొనర్చి లోకఖ్యాతిని బెచుగాని మా బాబు మాఘసందేశము నొనర్చి త్రిలోకఖ్యాతిఁ జెందియుండును. ఏమి బాబూ!

సేతు—కవిత్వము లోకఖ్యాతికొక సాధనమని యనుకొను నిర్భాగ్యుఁడవు నీ వెక్కడ నున్నావా? ఓరి బుద్ధిహీనుఁడా! కవిత్వము వలన నిదివఱకు లోకమునకుఁ గలిగిన మేలేమి? వాల్మీకి భారతము వ్రాయకపోయిన యెడలఁ బ్రపంచమునకుఁ గలుగు నష్టమేమి? దశరథునకుఁ బదునాలుగువందల భార్యలుంట చేతఁ బదునెనిమిది కోటయేండ్లు పరిపా

లించుటకుఁ గారణమైనది. కృష్ణుఁడొక్క గీతపద్యమైనఁ జెప్పినాఁడా! ఆతఁడు ఖ్యాతికి మూలకారణమేదో యెఱుఁగుదు. అంతవెఱ్ఱిముండకొడుకై డెబ్బదిమూఁడువేల గోపికలను బెట్టుకోలేఁడు.

మా—మా బాబు కవిత్వతత్త్వవిచారమునకుఁ బ్రజ్ఞ. ఏమిబాబూ!

ఇందు—(అప) ఈడిక్కుమాలిన సంభాషణమున కంతమునదా? లేదా?

సుంద—(అప) ఇదిగో! (ప్ర) రాజా! రసశాస్త్రమున మీమతమేదియో మాకుఁ దెలిసినది కాని, మీమతములో మేమేకీభవించువారముగాము.

సేతు—మీకు మాకు నేతము పెట్టెక్కడో చెప్పు.

సుంద—రాజునకెల్లప్పుడు రాణియనునదొకర్తియే యుండవలెను. మీరుప్రతిపాదించిన బహుస్త్రీత్వము మాకసమ్మతము. ఈమె మీరువిధ్యుక్తముగా వివాహమాడునెడల సిద్ధము రాణులుందురు. అపకి రాదు. ఆమెయైననుండవలయు నీనెచ్చెలియైననుండవలయును.

ఇందు—(తనలో) సుందరి కష్టజీవనమో సుఖమరణమో తేలుగల యంశము నడిగినది. గుండెలలో నగ్నిప్రవేశము పగులుటకు సిద్ధముగన్నది.

సుంద—ఈమాత్రపు టంశమునకు మీరింతయాలోచించుచున్నారెందులకోయని మా రాణి మీయనురాగమునందు విశ్వాసలేక తహతహ పడుచున్నది.

సేతు—మనకాలోచన మెంతమాత్రము లేదు. ఆవేశప్రధానమగునంశ మాలోచనీయము కానేరదు. మొదటికిఁ హృదయము బానిస కానేరదు. కారణబద్ధమది—కౌతుకబద్ధమిది. క్రొత్తయాకాయ వచ్చినప్పుడు ప్రాఁతదాని నెవఁడు మూర్కొనును? పచ్చవాలుగ వచ్చినప్పుడుప్పుచేఁతు నెవఁడాదరించును?

ఇందు—(తనలో) హా ! భగవంతుఁడా !

సుంద—ప్రాఁత దాని నాదరింపక పోవుట యే కాదు. దానిని బూర్ణముగ విడిచిపెట్టవలయును.

సేతు—దానిపేరేయది. అంతపూర్వాచారపరాయణ నిర్భాగ్యులము కాము. కౌమారమువిడిచిపోయినప్పుడుకదా యౌవనము రావలసినది. అట్లు కాలవైఖరిననుసరింపలేని యప్రయోజకులముగాము

వృద్ధా—మాబాబు గొప్పవివాహసంస్కర్త. ఏమిబాబూ !

సుంద—(అప) అమ్మా ! కూలిపోవుచున్నావేమో నన్ను గట్టిగఁ బట్టుకొనుము.

ఇందు—(అప) కూలిపోవుటకు నేనేమి పిటికిదాననా ? అనుకొనినంత యేవింటిని. ఆకస్మికోపద్రవమేదియు లేదే. ఇఁక వింధ్యాద్రి వలెనుఁ బడెదను. దావానలమంటుకొనసీ—పిడుగులుపడనీ—చెక్కుచెదరుదునా ? ఇక్కడకు మంగళసూత్రవిచ్ఛిత్తియైనది. నేనికఁ రాణినిగాను. ఆఁడుదాననుగాను. నరజన్మనుగూడఁగాను. పూలదండ త్రాఁచుపామైనది. కంచిమేఁక శార్దూలియైనది. పంటికాటో, పంజా వ్రేటో యింక నవశిష్టము. సుందరీ ! నీయనుజ్ఞలేకుండ నేనుస్వతంత్రించి యేమియుఁ దొందరపడనని ప్రమాణము చేసియుంటిని? ఆముడి సడలుపుము.

సుంద—(అప) ఆముడి విడునది కాదు. అదివిశ్వాసహీనుఁడు వైచిన కల్యాణపుముడి కాదు. విశ్వాసినియగు దాసివైచిన వశ్యతంత్రపుముడి. నీవుతొందరపడుదువనియే నిన్నట్లుబిగింపవలసివచ్చెను. వగమన ముఖ్యోద్దేశము కాదు. తంత్రము ఫలముచెందనప్పుడది యుండనే యున్నది.

సేతు—సుందరీ ! మీరాణి కింకసందేహమేమి ?

సుంద—మీారనఁ జగినమాట— యీామెవినఁదగినమాట మీా నోటివెంటఁ గఁఠోక్తిగ రాలేదని.

సేతు—చుక్క పోవుచుటయేమి ? రాత్రియంతయగుటేమి ! క్రొత్తరాణికౌఁగిలింత లేమి ! ప్రాఁతరాణి యప్పగింత లేమి ? ఇఁక సరేనా ? కాని తెపో యెల్లుండియో కాని వివాహము జరుగదుగదా యీాలోపల నీవు నాయొద్దనుండి యీాశపథము తీసికొనవచ్చునా ?

సుంద—మా యేర్పాటు జరుగకున్న యెడల మా ప్రాణములు మీాకిచ్చెదము. మీారే తీసికొందురు. మీాశపథము జరుగకున్న యెడల మీారు మాకేమియిచ్చెదరు ?

సేతు—ఓ ! రాజ్యము నే యిచ్చెదము.

సుంద—మీారు బలవంతులు. ఈమె మీాయధీనగాయున్న మీాయేర్పాటుజరుపుటకు మాకిష్టము కాకున్న యెడల మీారు జరిగించుకొనఁగలరు ; మీాశపథమును గూర్చి యేగట్టిచిక్కు... మిమ్ముల్ననుక యిట్లుచెప్పుచుంటిమని యనుకొనవలదు. మీాశపథమునకు ప్రత్యుత్తరముగ మీారు మాకేమైన నొసఁగుఁడు.

సేతు—ఏమి కావలయును ?

సుంద—మీాశపథము తీర్చుకొనకున్న రాజ్యమిచ్చెదనని మీారు బాసచేసితిరి కావున నెటుపోయి యెటువచ్చినను శపథమును గూర్చియైన మీాకు జ్ఞప్తితెచ్చుటకైన మాకుండవలయును గా రాజచిహ్నమగు ముద్రాంగుళీయకము మీామెకోరుచున్నది.

సేతు—అభ్యంతరమేమి ? ఇదిగో !—కాని—యొక్క మనుద్ర—

సుంద—ఆప్రశంసయిప్పుడువలదు.

మా—ముద్దున కొక్క రాజ్యము—ముద్దున కొక్క రాజ్యము మాబాబు కలియుగకర్ణావతారము ! ఏమిబాబూ !

సేతు—హా హా హా! వివాహామైనతరువాతనే మనకు సంపూర్ణమైన సాపాటా? సరే.

సుంద—ఉంగరమిచ్చెదరా?

సేతు—ఇదిగో! (ఇచ్చును.)

సుంద—(ఇందుమతి కిచ్చును) అయ్యా! మాకింక సెలవా?

సేతు—మాశృంగారరసమునకుఁ బొంగే కాని శాంతి లేక పోయినది. నాలుగుచూరు లంటించినారు. ఆర్పకుండ నడచుచున్నారు.

సుంద—శాంతికాల మాసన్నమైనది. తొందరయేల? అయ్యా! మా రాణి మీయొద్ద సెలవుతీసికొందునని చెప్పుచున్నది.

సేతు—సరే. ఓరీ రాఘూ! దారిఁజూపుము.

మా—చిత్తము బాబూ! ఇటు—ఇటు—

(ఇరువురునిష్క్రమింతురు.)

ఇందు—వారు పోయినట్లేకద!

సుంద—ఆ.

ఇందు—ఈముద్రయుంగరము మనకేల? తేపుకాని మెల్లుండి కాని వివాహమును నిశ్చయపఱచితిమి. ఏమిచేయఁదలఁచితివో నాకేమియు బోధపడదు. నామనము మండిపోవుచున్నది. కసిదీరునట్లేమియేని జేయునలయును. కాని యిక్కడఁజేయునదేమున్నది!

సుంద—ఏమియు లేదు. అంతఃపురమునకుఁ బోవలయును.

ఇందు—అచ్చటికేల?

సుంద—నీభర్త యటకు నిన్నుఁజూచి మాటలాడవచ్చునేమో?

ఇందు—నాకింక భర్త యేఁడీ?

సుంద—అట్లనరాదు. వేగమురమ్ము.

ఇందు—ఏల?

సుంద — ఈపురాత్రి మనమిద్దఱము చేయఁదగినపనివిశేషము గానున్నది. యోజించిపంపుకొందము రమ్మా.

ఇందు — నీవు నీబసకుఁబోవా ?

సుంద — ఇప్పు డర్ధరాత్రమునఁ గోటలో నన్నుఁ జూచువా రెవ్వరు ? కాని, ఈపురాత్రిమాత్రము మనము కొత్తరాణియింటికిఁ బోవలయును. మఱికొన్నిసంగతు లీలోపల జరుగవలసియున్నవి.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

శ్రీ

# ముద్రిక.

---

చతుర్థాంకము.

---

ప్రదేశము—క్రొత్త రాణి యుంటెనందు.

ప్రవేశము—రాజువేషమున నిందుమతి—దాసి సుందరి.

సుంద—అమ్మా! ఇటు. ఇటు.

ఇందు—ఇంకనిటే. అటు దేహమునకు మనస్సునకుఁ గూడ వదలిపోయినది కాదా.

సుంద—ఎక్కడ వదలిపోవును? మఱింత బిగియుటకేవచ్చినదనఁగూడనా?

ఇందు—ఔను—గొంతు.

సుంద—అంతవఱకు వచ్చునరి కెన్నిగొంతులు తెగవలయునో!

ఇందు—కానీ! తెగఁదలఁచినవి మానునా? మర్యాద పోయినదికదా! రాజ్ఞీత్వము వదలినదికదా! స్త్రీత్వము నశించినదికదా?

సుంద—దానిని మించిన పురుషత్వము వచ్చినది. దానిలో శ్రేష్ఠమగు రాజత్వము వచ్చినదికదా! విచారమేల?

ఇందు—విచారమేవ తెకు? సంకోచమేవ తెకు? అంటుకొన్నయగ్నియు విచ్ఛన్నముగ మండనీ! రాష్ట్రము దగ్ధముకానీ! తల్లిదండ్రులచే మగనికొఱకు విడువఁబడితిని. మగఁడనువానిచే మఱియొకదానికొఱకు విడువఁబడితిని. ఇంక నే నెవ్వరిదానను? ఎవ్వరికిని నేను లేను. నాకున్న దొక్కపగ. అది తీర్చుకొని—

సుంద—అమ్మా! మీరింత మహోద్రేకమున నుండినయెడలఁ దంత్ర మెట్లుకొనసాగును? కొంచెము శాంతించి కార్యమాలోచింపవలయును.

ఇందు—వెఱ్ఱిదానా! నిందుదేవుప్రవరుఁ దూటుపడినది. నీ రాఁపుట నీతరమగునా? కార్య మెట్లుకొనసాగునంటివి? ఆతఁడు నన్ను విడువనే విడిచినాఁడు. ఇఁక సాగవలసిన దేమున్నది?

సుంద—ఆసంగతి నీతోఁ బ్రత్యక్షముగఁ జెప్పలేదు కాదా! ఈలోపల నాతనికి బుద్ధివచ్చినయెడలఁ గ్రొత్తరాణి నే విడుచునేమో?

ఇందు—ఆఁ? ప్రత్యక్షముగ నాతోడనే చెప్పలేదా?

సుంద—అదేమిమాట? నీవని యెఱిఁగి చెప్పినాఁడా యేమి? పైయాట తుటగిన మగముండకొడుకులలో పెలయాలిమోసములో నిక్షేపమును, కల్లాలిమోసములో నిప్పుస్పర్శమును జూడలేనివాఁ డెవ్వఁడు? పొల్లుకవిత్వపుటిచ్ఛగములతోఁ బ్రేమకేతములు పాడలేనివాఁ డెవ్వఁడు? గుడిసెసభలోఁ గోళ్ళగంపలనుకును మంచెపీఠమున స్వభార్యాసంగపరిత్యాగోపన్యాసములు పంచాననస్వామమున నుపన్యసింపలేనివాఁ డెవ్వఁడు? ఇవి యున్నయుఁ గణ్ణాకణ్ణిగ విని, సంసారులు భర్తలపైఁ బగ తీర్చుకొనునెడల, మగవాండ్రలో రూపాయకు మూఁడు పావులాలవలె తీసరికి పరచుకుడించియే యుండును.

ఇందు—అందుకొఱకే నాకీపాము మెలికలదారి వలవంటిని. ఈమాటలు కాపులు పనికిరావంటిని.

సుంద—వీనిలోఁ దప్పేమియు లేదు కాని, యిప్పుడా వేశము తెచ్చుకొనుటమాత్రము తప్పు. అట్లు మీరాచరించుచున్నారు. అందువలన నామనసు కూడఁ జెదరుచున్నది. ముందాలోచనము తోఁపకుండ నున్నది.

ఇందు—నీవన్యథా యెంచవలదు. నీవు చెప్పినట్లు విందునని నే నొప్పుకొంటిని. రెండుమాటలదానను గాను కాని నీకున్న శాంతి నాకు రమ్మన్న రాదు. నే నిప్పుడంత తొందరపడినదియు లేదనుకొందును. ఐనను నీవు చెప్పినట్లేమాత్రమైన తొందరకూడ నిరకముంచుకొనబడకుండ నుండెదను. ముందు జరుగవలసిన దేదియో కానిమ్ము.

సుంద—జరుపవలసినదంతయు మీరే. ఈనాటకమునం ప్రధానపాత్రము మీరేకారా?

ఇందు—కాని సూత్రధారోద్యోగము నీయందు నిలిచియున్నది కాదా?

సుంద—అది నిజమే. ఇంతవఱకు మనమనుకొనిన మాటలనే నీవామెను బ్రిమాదములేకుండ నడుగవలయును.

ఇందు—తప్పనప్పుడు మొదలందించుటకు నీవు సిద్ధముగనే యుందువు కాదా? ఇంక సందేహమేమి?

సుంద—అటులైన రమ్ము ఇటు. ఇటు. మిగులం జీకటిగా నున్నది.

ఇందు—మూసు. రాజుగారి కాయుత్తర మందం జేసితివి కాదా?

సుంద—మాఘునకిచ్చి రాజుగారికిం బంపితినని నీకిదివఱకే చెప్పియుండలేదా?

ఇందు—నా మనస్సునందు మిక్కిలి భ్రమించు చక్రమునందువలె నేటినైచిన నది తూలి పడిపోవుచున్నది. రాజుగారీసరికి సంకేతస్థలికి వచ్చియుందురా?

సుంద—వచ్చుటయు నైనది. అతండున్నగదికి బీగము వేయుటయు నైనది.

ఇందు—ఇంతవఱకు రవంత మంచిపనియే జరిగినది. కల్యాణావేశము కారాగృహప్రవేశములోనికిం బరిణమించినదా. కానీ!

సుంత—అతఁడట్లు బద్ధుఁడై యుండనిమొదల మనమీాతని నెట్లు చూచి మాటాడఁవచ్చును? అందుకొఱకు కాపనిమే దీనికంటె ముందు చేయవలసి వచ్చెను.

(నేపథ్యమున)

ఎవరా మాటలాడువారు?

సుంద—ద్వారరక్షకా! చప్పునఁ దలుపు దెఱువుము.

(నేపథ్యమున) వీలు లేదు పో.

సుంద—నీగొంతుగోయ! రాజుగారు వచ్చినారురా!

(తెరమెత్తఁగఁ గొత్తరాణి ముంగిలిద్వారరక్షకుఁ డగపడును.)

సుంద—అన్నిద్వారములు బాగుగ రక్షింపఁబడుచున్నవా

ద్వార—దండము దండము బాబూ! క్షమింపవలెను. గు లేకపోయినది. ఈఁగకైన నవకాశమీాయకుండఁ గాచుచున్నాము.

సుంద—ద్వారరక్షకా! నీవు ముందు నడచుచు బాబుగారి దారి చూపుము.

ద్వార—చిత్తము బాబూ! దయచేయుఁడు; లేరా! రా గారు దయచేసినారురా! నీసిగఁగోయ! బాబూ! ఇటు ఇటు. ద్వారముదాఁటి మేము లోపలికిరా వీలులేదు బాబూ!

సుంద—సరే! నీవు నీతావునకుఁ బొమ్ము.

(ద్వారరక్షకుఁడు నిష్క్రమించును

ఇందు—సుందరీ! ఈయింటిలో దాసి యెవతెయో యెఱుగుదువా?

సుంద—ద్వారరక్షకుఁడు చెప్పినమాట యసత్యము కాదు పైగాలి లోనికి లోనిగాలి పైకిఁ బోకుండునట్టి నిర్బంధమిట జరుగు

చున్నది. దాసి యున్నదో లేదో. ఉండక తప్పదు లెండు. అదియెట్టి స్వభావముగలదియో యేమియుఁ దెలియుట కవకాశములేదు. ఇదిగో తలుపు వైచియున్నది. ఈ యుతక యెత్తెద (అట్లు చేసి) అమ్మా! లోనికి రమ్మ.

(లోపలితెర యెత్తగ నొకపెద్దగదియు దానిలో నొక యరయు గనఁబడును.)

మహారాజచంద్రమా! మీరీపీఠముపైఁ గూరుచుండుఁడు.

(రాణి కూరుచుండును.)

(అప) అమ్మా! అదిగో యొకదాసి అటచాఁపపైఁ బండుకొని నిద్రించుచున్నది. దాసి లేపనా?

ఇందు — ఆవ్యక్తి దాసియేనా?

సుంద — (చూచి) అమ్మా ఇదిదాసియే ఇదిగో! కొంచెము మోటుపనులచేత నరచేతులలోఁ జిప్పకాయలు కాచియున్నవి. ఇవిగో గోళ్లుకొంచెమరిగినవి. అరకాళ్లుకూడఁ గొంచెముగ బీసుదేరియున్నవి— కన్నెత్రికప్పుఁ బెండ్లి కొడుకుకట్టించుతాళి యిదిగో! అదిగాక వైఖరిచూడఁ గఁ బిల్లలతల్లివలెఁ గనుపట్టుచున్నది. అక్కా! అక్కా! పలుకవేల? చాపలే కుకద!

ఇందు — అట్లుగుట్టుతీయుచుండగనే.

సుంద — చూచితివా? ఒడలిపైఁ బైఁటయైన నెఱుఁగకుండ నెట్లు నిద్రించుచున్నదో.

ఇందు — పాపము. కొంచెము సవరింపుము.

సుంద — (అట్లుచేయుచు) అంతఃపురరక్షకై యిట్టిదాసులుండిన విన్నియో మేమన్నది? ఒడలిగుడ్డయైన నెఱుఁగకుండ నిద్రించు

చున్నది. నేననఁగూడను కాని యొక్కమాయింటఁబుట్టినది కొ రెండవది దాసివృత్తి కర్హురాలు కాదు.

ఇందు—విశ్వాసమనునది తన పుణ్యఁ బుట్టువలయును గా తలయెత్తు వరాలు దిమ్మరించినన్నైనఁ గలుగునా?

సుంద—నా తెలివిలు చల్లగానున్న యెడల నేను లోక మీఁదఁబడి నెత్తి వాయఁగొట్టి యిల్లునించుకొనవలయునుగాని వీరిచ్చిన నాకెంత? ఈయకపోయిన నాకెంత? అది కాక యింతప్పు దాసుల జీతాలసౌభాగ్యమెవరెఱుఁగనిది? కాని, కావలసినంత స్వతంత్రత, కావలసినంత రాఁబడికల కల్పవృక్షమువంటివృత్తి నిట్టిదౌర్భాగ్యలుచేరి ధ్వస్తము చేసినారు. లే! పెద్దమ్మ లే. (చేయిపట్టిలాగును

సంపంగి—(ఒడలు విఱుచుకొనుచు) డొంకికట్టపెట్టి లాగినప్పుడే రాలినది. (సంపంగి లేచును.)

ఇందు—(పలవరించుచున్నది.)

సుంద—ఈలాగునఁ గొప్పుపట్టి యీడ్చినప్పుడే లేవవలసిన (లాగును.)

సంపంగి—(లేచును.)

సుంద—మహారాజుగారు! లేచి నిలువఁబడు.

సంప—(నిలువఁబడి) అమ్మయ్యో! (పాఱిపోవును)

సుంద—(సంపఁగి నోరుమూసి రాణికత్తిని జూపించును.)

సంప—(గడగడ వడఁకుచు) అమ్మ! అమ్మ! (నమస్కరించును.)

సుంద—నిన్నుఁగాని నీరాణినిగాని బాధించుటకువీరు రాలే నీవలనఁ గొన్నిసంగతులు తెలియవలసియున్నవి.

ఇందు—సుందరీ! దీనివలనఁ దెలియవలసిన యంశము లేమున్నవి?

సుంద—(అప) ఈ క్రొత్తరాణిని రాజెక్కడ గ్రహించెనో, యెట్లు గ్రహించెనో, వీరి పేయూరో, వారచ్చటి కేలవచ్చిరో యీ మొదలగు సంగతులు మనకుఁ దెలియవు. మాఘుఁడాస సమయమున రాజుతో లేకపోవుటవలన నాతనికిఁ దెలియదు. ఈయంశము లామె నడిగినట్లుకాకుండఁ దెలిసికొనవలయును.

ఇందు—(అప) ఆసంగతు లిప్పుడు మనకంత యావశ్యకములా ?

సుంద—(అప) మీరు క్రొత్తరాణితో మాటలాడునప్పుడు మాటలధోరణిలోఁ బూర్వాంశములకు విరుద్ధముగ నేమైన మీరు పలుకునెడల మీరు రాజుగారు కారని యామె గ్రహింపవచ్చును.

ఇందు—సరే. అడుగుము.

సుంద—నీపే రేది ?

సంప—పేపా ? పేపేమో నాకెట్లు తెలియును ? ఈరాత్రి బ్రదుకు నిజమైనయెడల పేపటిమాట చూచుకొనవచ్చును. అమ్మా ! బాబూ ! రక్షింపుఁడు.

సుంద—పేపుకాదు. నీపేరు ? (ఒడలిమీఁద వ్రేలితోఁ బొడుచును.)

సంప—మిరియాలపేసు. ఇది మామసలమ్మగారి కష్టార్జితము. మాసంపాదన లిప్పుడు సంతఖర్చునకైన సరిపోకుండనున్నవి. అమ్మా ! అమ్మా ! ఇది పోయినయెడల మాకు మరేమియు లేదు. రక్షించు. రక్షించు.

ఇందు—చెవిటిముండ కాఁబోలు !

సుంద—నీకుఁ జెవుడాయేమి ? (చెవులు చూపించును.)

సంప—ఈనుద్దులు తీర్థాని కెరుపు తెచ్చుకొంటినమ్మా ! పది లక్కడనుండి యీదిక్కుమాలిన యూర్వఁబడితిమి.

సుంద—అమ్మా! వింటిరా! వీరేదో తీర్థయాత్రకు బయలు దేరఁగ మనరాజుగారు తెచ్చినారని తెలియుచున్నది.

ఇందు—సరే.

సుంద—మీరేయూరనుండి వచ్చినారు?

సంప—ఏకూరలు వండించుకొన్నారమూ? వండించుకొనుట యెక్కడిది? మామేనమామ నిక్షేపములాగున వంటచేయునతని నీ మహారాజుగారు కడ తేర్చినారు కాదా? ఆనాఁడే మా రాణిగారిని చెంపినాఁడు. అప్పటినుండియు నామె యన్నముతినుటయే మానివైచినది. మంచితీర్థమునుమాత్రము త్రాగును. ఇంక నాకొక్కటతకుఁ గూరలెందులకు? ఏదో! మనస్సుతిన్నఁగ లేనప్పుడు—ఇఁక దినవలెనప్పుడుకదా యని—

సుంద—ఉస్సు! ఊరకుండుము. ఊరకుండుము.

సంప—కూరవంటమాటయేనా? రొయ్యపప్పుచేరు—మామిడికాయపచ్చడి.

సుంద—ఊరకుండవేమి? నీవు ముండమోయ!

సంప—కూరకుండయేది యనియడిగెదవా? అమ్మగారి దానిలోనేమియు మిగులలేదు.

ఇందు—వట్టి చెవిటిది.

సుంద—అక్కడక్కడఁ గొంచెము వినఁబడుచునేయున్న నేను నిమ్మళముగ పలుకుచున్నాను గావునఁ బూర్తిగ వినఁబడకున్నదేమో?

ఇందు—నిమ్మళముగ మాటలాడుచున్నావు కావున నీ పెదవుల కదలికనుబట్టియు సంజ్ఞలనుబట్టియు నీ మాత్రమైన గ్రహించుచున్నది. గగనదుగునెడలఁ జెవిపొర యదరుటచే మఱింత వినఁకుండును.

సుంద—ఐననునా వెఱ్ఱితీర్చుకొందును. (గట్టిగ) మీరాణి యేది?

సంప—ఏమి ? ఏమి ?

సుంద—మీరాణి ?

సంప—గంటలా ? మాకేమిగఁడియారమా ? మన్నా ?

(నేపథ్యమున) నన్నడుగువారెవ్వరు ?

సుంద—అమ్మా ! మీదాసురాలను. ఇటులొక్క సారినిద్రా భంగమునకోర్చి దయచేయుఁడు.

(మానవతి ప్రవేశించును)

మాన—నన్నుఁ గూర్చి యడిగినవారెవ్వరు ?

సంప—అమ్మా ! అమ్మా ! ఎవ్వరోవచ్చినారు.

సుంద—అమ్మా ! నేనే. ఇట్లుదయచేయుఁడు. (తనలో) తిరుగ లోనికిఁబోకుండ నీమెవచ్చినద్వారపుఁదలుపునకుఁ దాళము వైచెదను.

(అట్లు చేయును)

మాన—(రాజవేషమునసున్న యిందుమతినిజూచి యదరిపడి సుందరితో) లే. దారిలో లే. (వెళ్లిపోవుచు) ఆతలుపు వైచెదవేమి ?

సుంద—అమ్మా ! తొందరయేల ? కోపపడకుము. అదిగో ! మహారాజుగారు. ఆయనను ప్రసన్నదృష్టిని జూచి యీరాజ్యము మమ్ము నాతని నేలుకొనుము.

సంప—(అప) అమ్మా ! రవంత సేపు మిరియాలపేరని, రవంత సేపు కూరకుండయని పలుకుచున్నారు.

మాన—(సంపగిచాటునకుఁబోయి మేలుముసుఁగు వైచుకొని నిలువఁబడును.)

(తనలో) ఎట్టిగతి పట్టినది ! హా భగవానుఁడా ! నేనేమి పాప మొనర్చితినని నన్నిట్టికష్టములఁ బెట్టుచున్నావు ! నీదయతక్క

నన్యాయము నేదియు నుపేక్షింపలేదని యెఱుఁగవా ? అట్టిచో దయ చూపకపోవుట సరికదా మిమ్ము మిక్కిలి బాధపెట్టుచుంటివా? కానీ! నీయిష్టము ! నీవిచ్చు బాధకూడ మహాప్రసాదముగనే భావింతును.

సుంద—(అప) అమ్మా ! ఊరకుండు వేల ? నీవరవతెచ్చుకొని రాజపాత్రము నభినయింపుము. క్రొత్తరాణిని జూచితివా ? ఎంత తేజస్సంపన్నయైయున్నదో ?

ఇందు—(అప) సుందరీ ! నీవధిక్షేపించుచుంటివేమో కాని నాకంటి కామె బంగారుబొమ్మవలెఁ గానఁబడుచున్నది. ఈమెమొగము చూడఁగనే నాకేమో విశ్వాసభాజనముగనున్నదిసుమా !

సుంద—(అప) భర్తృపాత్రమవు కావున నీకట్టులామె కనఁబడవలసినదే. కానీ, యాలసింపకుము.

ఇందు—కాంతాలలామా! ఓసుందరీతిలకమా! (క్రొత్తరాణిం గొంచెము సమీపించును)

సంప—అమ్మా ! ఈ రాజుగారు నన్నుఁ బిలుచుచు నాకొఱకుఁ గాఁబోలు దగ్గఱగ వచ్చుచున్నట్లున్నారు.

సుంద—(తనలో) నీమొగమిూడ్వ ! దూదేకులసాహేబులో కాని నీదొడ్డికాళ్లబ్రదుకునకు దొరగారు కూడనా ?

ఇందు—ఓవనితారత్నమా ! నీవు నాతో మాటలాడకుండ నున్నావు. నీకుఁ గోపము రాఁదగినపనియే నేను జేసియుంటిని. క్షమింపవలయును.

సుంద—అమ్మా ! దయయుంచి మా రాజుగారితో మాటలాడవలయును. ఇక్కడ నాయనయొక్కఁడు తక్క మిగులువారందఱు స్త్రీలేకదా ! అందులో మేమిద్దఱము దాసులమే. అందుచే నీమాత్రము నకమక యుండవలసినపారమే కాదు. ఇంక సందేహమేల

మాన—ఇట్టులైన నీపేరేమి ?



చతుర్థాంకము.

సుంద — సుందరి.

మాన — సుందరీ! నీతో మాటలాడ... నేను ... గారితో మాటలాడను. ఈతఁడు మాయెడల మహా... నాఁడు. ప్రజల మానప్రాణములు రక్షింపఁగలసిన ప్రభుఁడే యిట్లు ప్రజాపకారము చేసినయెడలఁ బ్రజలు బ్రదుకుదురా? ఉపాధ్యాయుఁడే శిష్యులకు దుర్నీతిని గఱపునెడలఁ బల్లెకూటమిఁక గల్లుపాకయే కాదా? గొల్లఁడే గొఱ్ఱెలను హింసింపఁజొచ్చినచో మందస్థితియిఁక మాంసపుదుకాణమే కాదా?

ఇందు — గతించినదానికి వగచిన వినియోగము లేదు. ఇదివఱకు నావలన జరిగిన యపకారమును మించిన యుపకారమును నేను జేయ సంకల్పించుకొనియుంటిని. విధ్యుక్తముగాఁ బెండ్లాడి యీదేశమునకు నిన్ను రాజ్ఞిగాఁ జేసెదను.

మాన — సుందరీ! నాకు రాజ్ఞీత్వ మక్కఱలేదు. భాగ్యభోగ్యము లపేక్షించుదానను గానని నిశ్చయముగా నమ్మవలయును.

ఇందు — నీవిట నాకు స్వాధీనవై యున్నావు. నీవు నన్నుఁ దప్పించుకొని పోఁజాలవు. లేనిపోని బింకపుమాటలతోఁ బ్రయోజనము లేదు. నన్నంగీకరించి సుఖపడుము.

సుంద — (అప) అమ్మా! జీలుగుబెండు లాగున వట్టి చప్పని నిస్సారమైన మాటలాడుచున్నావు. మనమాలోచించుకొనిన రసవంతమైన పూర్వప్రణాళిక మొదటినుండియుఁ దప్పఁగొట్టితి వేమి?

ఇందు — (అప) నాకింతకంటె రసవంతములైన మాటలు రావు. నన్నేమి చేయుమంటివి? మొదట నాకు సుగతనము లేదయ్యెను. రాజ్ఞికి నాపై వలపు లేదయ్యెను. రాజును దలఁచుకొనఁ గడుపు దహించుకొనిపోవుచున్నదయ్యెను. ఇఁక నాహృదయములో రస మె

చ్చటనుండి వచ్చును? మాటలలో సారమెక్కడనుండి వచ్చును ఇదేదో చప్పునఁ దెలిసికొనలేను. (ప్రకాశముగా) రాజ్ఞీమణీ! నీపేరేది?

మాన—సుందరీ! మొదలే పెద్దపేరులేదు. ఉన్న దేదో నా మూలమున మాసిపోయినది. ఇఁక నట్టిప్రశ్నము వలదు.

ఇందు—పోనీ! నీతలిదండ్రు లెవ్వరో యదియైనఁ జెప్పుదువా?

మాన—సుందరీ! క్షత్రియకాంతనైన నేను—పరరాజుచే హరింపఁబడి—పరదేశమున బందెలో నుంపఁబడి—బానిసవలెఁ బరరాజుచే బహిరంగముగఁ జూడఁబడి—పరిణయమునకై వాంఛింపఁబడి—యధమాధమనై యుంకను బ్రదికియున్న నేను—పరమపవిత్రులు, పావనములు నైన తల్లిదండ్రుల నామములందలి తేజోమయాక్షరముల నుచ్చరించుటకంటె మహాపాతకమున్నదా? అంతకంటె రాజహత్య మంచిది కాదా?

ఇందు—ఆ? ఏమి? రాజహత్యయే మంచిదనుచుంటివా?

మాన—సుందరీ! కాదా మఱి? ఇదివఱకే యది జరిగియుండిన యెడల నెన్నిప్రాణులు సుఖించునో?

ఇందు—సరే. వధ మెంతసేపు? నీవు నన్నంగీకరింపని యెడ నాలాగుననే కావచ్చును.

సుంద—(అప) ఉక్తిప్రత్యుక్తిసందర్భమెఱుఁగనివాఁడు నాటకమును వ్రాయునట్లు లేదో పట్టుగా—తెచ్చిపెట్టినట్లుగా గ్రంథము నడిపించుచున్నావు.

మాన—సుందరీ! ఎటులు? వధమెంతసేపా? నన్నంగీకరింపని యెడల నటులే కావచ్చునా! సెబాస్! నీయేలిక యింతసేపటికి మగవాఁడు మాటలాడినట్లు మాటలాడినాఁడు.

ఇందు—(అప) సుందరీ! ఈకాంత నా యసమర్థము గ్రహింపదా యేమి?

సుంద—(అప) వీటువి ప్రయోజకత్వము నొక్కః తెప్పపాటు లో దాసి కనిపట్టఁగలదా. ప్రభునిసామర్థ్య మొక్కమాటలో బంటు కనిపట్టఁగలఁడు. పెండ్లికొడుకు తెల్లమొగము పెండ్లికూఁతురు కనిపట్ట లేకపోవుట యేమి ?

ఇందు—(అప) నే నాఁడుదాననని కూడ గ్రహింపలేదుకదా?

సుంద—(అప) అది యొక్కటే తరువాయి.

ఇందు—(అప) నేను దిన్నఁగమాటలాడలేనని యేరాజువేసము నిన్ను వేయుమంటిని.

సుంద—(అప) చాలు-అడుగనక్క అలేదు-మీయంతరమేమి? నాయంతరమేమి? నేను రాజువేసము వేసి మిమ్ము నాయొద్ద దాసిగాఁ గూడఁ జేయవలయునా ?

మాన—సుందరీ ! ఊరకుండుటయేల ? అంగీకరింపనియెడల వధమే కావచ్చునని మీరాజు పలికినాఁడు. 'అంగీకరింపనియెడల' నను మాటయేల ? అంగీకరింపలేదు. అంగీకరింపను. వధమున కింక నవ శిష్ట మేమున్నది? ఏడుదినములనుండి కాంబోలు నుపవాసము చేయు చున్నాను. ప్రాణము పోకుండనున్నది. వేగఁదెమలుపుమని చెప్పుము.

సుంద—అమ్మా ! సుఖజీవనమున కవకాశమున్నప్పుడు ప్రాణ పరిత్యాగము చేయఁబూనుట తగునా ? ఈరాష్ట్రమున కంతకు మహా రాజ్ఞివై మారాజును, రాజ్యమును బ్రజలను బరిపాలించుచు నుండవల సినదాన విట్లాడుట తగునా?

మాన—సుందరీ ! నీవు దాసివనుసంగతి మఱచిపోయి తలవుఁ దగనిబోధనములు చేయుచున్నావు. తప్పు.

ఇందు—(అప) సుందరీ ! చూచితివా ? యీ కాంతయోగ్యత. ఇది నాథర్తను వివాహమాడుట కంగీకరించినయెడల దీని నెక్కడికై

నఁ బంపి రాజున కింకఁ గనఁబడకుండఁ జేయవలయునను కోరికతో రాజవేషమును ధరించివచ్చిన నాకీ యాశాభంగము మిగుల సంతోషకరముగా నున్నదిసుమా !

సుంద—(అప) అమ్మా ! ఏలాగుననో నీవు సంతోషముగా నుండుట కావలసినది.

మాన—సుందరీ ! ఎందులకీ సందేహమో కనుఁగొనుము. నడుమున వేలాడు శాతకుకత్తితోఁ బిడికెడు గొంతుక తెగదని సందేహమా ? నాలాగుననే తానుగూడ నాఁకఁదియగునప్పుడేకదా సందేహ ముండఁదగినది !

ఇందు—(అప) సుందరీ ! ఈమె తిరస్కారము గూడ నాకలకారముగనున్నది. (ప్రకాశముగ) కాంతామణీ ! నిన్ను నేను జుట్టు లేకపోవునంతమాత్రమున నేను స్త్రీనని యనఁదగదు. చంపఁగలిగినంత మాత్రమున నేను బురుషుఁడనని కూడ ననఁదగదు. నీయనిష్టతతో మనకు స్త్రీపురుషప్రసక్తి పోనేపోయినదికాదా ? నేను నిన్నుపెండ్లిం నట్లే నీవు నన్నుపెండ్లింతువని నిన్నుఁ దెచ్చితిని. నావలనఁ దప్పువచ్చిన నిన్ను నీయింటికి సగౌరవముగాఁ బంపుదును. నీయూరేదో, తల్లిదండ్రులెవరో, నాకుఁ దెలుపనక్కఱలేదు. నేనిచ్చు పరివారమును దీకొని నీవు నీయింటికి యథేష్టముగా నిప్పుడే పోవచ్చును.

మాన—సుందరీ! నేను బోవునది మింటికిఁగాని యింటికిఁగాదు లక్ష్మీదేవి మ్రొక్కుచెల్లించుకొనిననే నీసరి కిల్లుచేరి కొన్నిదినములుండవలసినది. "అమ్మా ! యిన్నిదినము లాలసించితివేల", యని యడుగు మాతల్లిదండ్రులతో నేనేమిచెప్పవలసినది ? నన్నొ వరిం యొకఁడపహరించుకొనిపోయినాఁడని చెప్పవలసినదా ? నాలుకఁ గోకొందునుగాని నేనట్లు చెప్పుదునా ? 'అమా ! నిన్నుఁ బెంచిన

భృత్యుఁడే' డని యడుగ నన్నుపేక్షించినమిండనిచేఁ జచ్చెనని బ్రదికి యున్న నేను జెప్పవలసినదా ? సకారణముగనో నిష్కారణముగనో మాతల్లిదండ్రులమనస్సులందు నన్నుఁగూర్చిన సందేహము కలుగు పిమ్మట నింక నిల్లెందులకు ?

ఇందు—ఇక్కడనుండిన యెడలమాత్రి మాసందేహము కలుగ కుండునా ?

మాన—ఇక్కడ నుండుట కాదు. (మింటివైపునఁజూచి) అక్కడ. అక్కడ.

ఇందు—అట్లైన నిదివఱకే మరణింపలేకపోయితివా? నిన్నెవ రభ్యంతర పెట్టియుండలేదే?

మాన—సుందరీ ! అప్రియత్నముతోనేకదా యున్నది? దర్భ శయ్యపై నాల్గుదినములనుండి ప్రాయోపవేశము చేసియుండఁగాఁ బ్రిధానపుఁదంతువైకదా మీరు వేంచేసిరి. కాని యీపద్ధతిగా ముప్పది దినములకుఁగాని మరణింపనని భయపడుచున్నాను. అగ్ని జలాయుధాదులవలన నాత్మహత్యచేసికొనుట నాకిష్టము కాదు. అందువలననే యీ రవంతపుణ్యము గట్టుకొమ్మని మిమ్ముఁ బ్రార్థింపవలసివచ్చినది.

ఇందు—వనితారత్నమా ! మఱియొక్కసారి ప్రార్థించుచున్నాను. వినుము. ఈరాజ్యము నాకక్కఱలేదు అది నీది. నారాణిని నేను వదలుకొంటిని. నీవేనా—

మాన—(చెవులు మూసికొని) పాపము శాంతించునుగాక ! సుందరీ ! మీరాజును బొమ్మని చెప్పుము. భార్యను వదలుకొనినవాని మోమును జూడరాదు. (వెనుకకుఁదిరిగి కనులు మూసికొనును.)

ఇందు—(అప) సుందరీ ! ఆహా ! ఈమె యెంతటికాంతయే. ఈమెయే నాభర్తను భార్యయయియుండునెడల నాతఁడెంత లోకకంట

కుండుగాకయుండునుగదా! కాని యిఁక మనము చేయవలసినదేది?

సుంద—(అప) ఈమె నిక్కడినుండి తీసికొనిపోయి మఱియె క్కడనైనఁ దాఁపవలయును.

ఇందు—(అప) ఎందుచేత?

సుంద—(అప) రాజీమెను జూచుటయే సిద్ధించునేని సల నిట్టి యుత్తమక్షత్రియురాలిని హింసించును. అదిగాక ప్రసంగవశమున మనరహస్యము బయలైనఁ గాఁగలదు.

ఇందు—(అప) నేను నదియే యూహించుచున్నాను. కా యీమెను మఱియొకయెడకుఁ దీసికొనిపోవుటెట్లు? ఈమె మనకు లొంగునా? నాకీమెను జూచినకొలఁది ననురాగమేమో కాని హెచ్చు గుచున్నది. ఈమెను బలాత్కరించి యెక్కడికైనఁ దీసికొనిపో నాకు మనసొప్పకున్నది. తనయంత తానీమె యెక్కడికిని బోనను న్నది. ఈస్త్రీహత్య మనకుఁ జుట్టుకొనునేమో? ఆశ్చర్యా!—అక్కడ బద్ధుఁడైయున్నాఁడు. ఈమెయా—ఇక్కడఁ బ్రాణమోహవివశయై యున్నది. మనమా—మహారణ్యమధ్యమున దారితప్పినట్లున్నాము. సుందరీ! ఏ యీచిక్కులు. ఇప్పుడీమె నేమిచేయవలసియున్నది?

సుంద—(అప) అమ్మా! అధైర్యపడఁదగునా? బుద్ధిస్తంభింపఁ దగిన సమయమేయిది. అయిననేమి? తొందరపడక నిదానింపవ లయును. ముందామెకు మీయెడల సంపూర్ణవిశ్వాసముకలుగుమాటల గొన్ని యాడిన మంచిదనుకొందును.

ఇందు—(అప) అయ్యయ్యో! గుండె లదరిపోవుచున్న అహహా! పరమాభిమానవంతురాలు! బంగారుబొమ్మ! ప్రాణమ త్యాగము చేయునుగాఁబోలు! మనమిక్కడకు రాకయుండినయెడల క్షోభము లేకయుండునుగదా! విశ్వాసజనకములగు వాక్యము

నాథమంటివా? సరే. ఆతరువాయికూడఁ దీర్చుకొందును. (ప్రకాశ) ఓ అభిమానవతీ! నన్ను క్షమింపుము. నీవు నాకక్క అలేదు. భగవంతుని పాదములపై ప్రమాణముచేసి చెప్పుచున్నాను. నీవు నాకు సోదరివి. నీకు నావలన నెంతమాత్రము భయము లేదు. అమ్మా! బతిమాలుచున్నాను. ఈదయ్యాలకొంపలో నుండవలదు. నావెంటఁ గోటలోనికి రమ్ము. నిన్ను నారాణివాసాంతఃపురమున నుంచెదను. ఆమె నిన్ను గౌరవించును. అనేకదాసీగణముచే నీకుపచారము చేయించును. నాభార్యను నేను వదలుకొందునని యాడినతప్పుమాటకిదిగో లెంపలువైచుకొనుచున్నాను. (లెంపలు వైచికొనును.)

సుంద—(అప) సెబాస్! నీభర్త నీయెదుట నిట్లు లెంపలుకొట్టుకొను మహోత్సవమును శీఘ్రముగఁ జూతువుగాక! అమ్మా! ఇప్పుడు కొంచెము బాగుగ నేమాటలాడినావు.

మాన—నాకెవ్వరియుపచారములు వలదు. నేనెక్కడికిని రాను. ప్రాణము విడుచుట కొక్కడనైననేమి? సుందరీ! మీరాజు పుణ్యమాయని బ్రదుకన్నివిధములఁ జెడిపోయినది.

ఇందు—(మానవతి కాళ్లపైఁబడి) అమ్మా! నావలన మహాపరాధము కలిగినది. నన్ను క్షమింపుము. నీపరిశుద్ధికెన్నఁటికి లోపము లేదు. మంచునలుపెక్కునా? అమృతము పులుసెక్కునా? సందేహింపకుము. తల్లీ! నన్నుఁగటాక్షింపుము.

సుంద—(తనలో) పాపముచేసినవాఁడు భర్త. ప్రాయశ్చిత్తము పొందునది భార్య. ప్రపంచచర్యయెట్లున్నదో!

ఇంద—అమ్మా! నామాటవినుము. చప్పునఁ గోటలోనికిఁ బోవుదము రమ్ము. (చేతులుపట్టుకొనును.)

మాన—ఆ! ఆ! ముట్టుకొనకుము.

ఇందు—తల్లీ! సందేహింపకుము. నీకు నేను సోదరుడను, "అన్నా!" యని నన్నుఁ బిలువుము. అకార్యమని పిలిచిననైన నేనన ధాభావింపను. నీయోగ్యతవలననే నట్టినిష్ఠురమస్థితికిఁ దిగిపోయితిని. సందేహింపకుము. రమ్ము.

సుంద—అమ్మా! రమ్ము. ఎంతమాత్రమును సందేహింపకుము ఊఁ. ఊఁ.

మాన—అన్నా! నీవు నన్ను మోసము చేయుట కిట్లు చేయుచుంటివేమో నేను రాను.

ఇందు—(అప) రానున్నది. ఎట్లు?

సుంద—మహాప్రభూ! అంతసాహసమువలదు. వలదు. (మానవతితో) అమ్మా! నీవు రానియెడల మా రాజుగారిక్కడనే కత్తితోఁ బొడిచికొని (అప) అమ్మా! కత్తిపైకిఁ దీసి కొంతగడబిడ చేయుయూరకుందువేమి?

ఇందు—(కత్తి తీసి) సుందరీ! నీమాటను నేనువినను. నీవాగాణిని బతిమాలవలదు. ఆమె యెట్లునైనను రాదు. నేను జేసిన మహాపాపమునకుఁ బ్రాయశ్చిత్తముగాఁ బ్రాణములను విడువ నట్టిదనో సిద్ధముననున్నాను.

సుంద—అయ్యయ్యో! వలదు. బాబూ! వలదు వలదు, నన్ను ముందు చంపి మీరవ్యధా చేయుఁడు. అమ్మా! అమ్మా! రాజును రక్షింపుము. ఈ రాష్ట్రమును రక్షింపుము. బాబూ! తొందర పడవలదు. వలదు. (మానవతి కాళ్ళపైఁబడి) అమ్మా! రక్షింతువా

మాన—సరే! సుందరీ! లెమ్ము. నే వారింపఁ బెట్టుచున్నను.

సుంద—అమ్మా! ఎందుకు?

మాన—వావస్తువ్రాటి యటనున్నది. నేను దెచ్చుకొని మీతో వత్తును

సుంద— అది యేదో చెప్పినయెడల నేను మీ వెంటనే తీసికొని వచ్చెదను. మీరు నడచుచుండుఁడు.

మాన— అట్లుకాదు. తలుపుతీయుము.

సుంద— (అప) అమ్మా! లోపలికిఁబోయి తలుపువైచికొనిన యెడల నింత ప్రయత్నము వృథయైపోవునేమో?

ఇందు— నీకింక నామెయెడల విశ్వాసము కలుగలేదేమో కాని నాకుఁ బూర్ణముగాఁ గలిగినది. తలుపుతీయుము. ఎంతమాత్రము ను సందేహింపకుము.

సుంద— (తలుపుతీయును)

మాన— (లోనికిఁబోయి తిరుగవచ్చి, తనలో) ఇదిగో! యాత్రలోఁ బ్రాణరక్షణార్థ మక్కఱకువచ్చునని నాకు మాతండ్రిగారిచ్చిన కైజారు. ఇదిగో! ఇది మొలలోఁ గానఁబడకుండ దాఁచెదను. రాజు మోసమే చేయునెడల దీనితో వానినిబొడుతును.

ఇందు— అమ్మా! పోవుదము. రమ్మా.

మాన— (సంపఁగికి రమ్మని సంజ్ఞచేయును.)

సంప— అమ్మా! ఇదిగో వచ్చుచున్నాను. దాఁకలో రొయ్యలున్నవి. ఆదాఁకయు వంటకుండయుఁ దీసికొనివత్తును. (పోఁబోవును)

సుంద— (దానినిబట్టికొని) నీమొగముండఁగా మాకోటలోని కటకుండ యెందులకు? (తనలో) తెలివితక్కువనిర్భాగ్యురాలా! దాసినిబట్టి దొరసానికదృష్టమని చెప్పినమాట వేదవాక్యముకంటె భిన్నమా? ఇదిగో! ఇట్టి— ఇట్టి చమురుకాళ్లపెయ్య నాకుడుతుట్టె పెదవికొంకనక్కముండలున్నచోట నమ్మవారియదృష్టమునకుఁ దీసికట్టే.

ఇందు—సుందరీ ! రమ్మా.

సుంద—(అప) అమ్మా ! యీయమ్మమాట యిట్లున్నది, ఇంక నాయయ్యమాట యేదో శీఘ్రముగాఁ జూడవలయును.

ఇందు—(అప) ఊ !

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

శ్రీ

# ముద్రిక.

## పంచమాంకము.

ప్రదేశము — ఒకదొడ్డిలో వీధికి దూరముననున్న యొక ధాన్యపుఁగొట్టున కెదుట.

ప్రవేశము — సుందరి; ఇందుమతి.

ఇందు — సుందరీ ! నిమ్మళము. నిమ్మళము..

సుంద — అమ్మా ! నామాట కేమిగాని, యందెలు కడియములు గలసి చప్పుడగుచున్నవి. కడియములు పైకిలాగుకొనుము.

(కొట్టులోనుండి బిగ్గఱగా) ఎవరక్కడ ! ఎవరక్కడ ! మాటలాడరేమి ? (గట్టిగా) ఎవరయ్యోయి !

ఇందు — లోనుండి మనయలికిడి కనిపట్టినాఁడు కాఁబోలు !

సుంద — గదిలో బిగింపఁబడినవాఁడు కన్నులు లేనివాఁడువలె గడియగడియకు "నెవరక్కడ" యని యనుట సహజము. అంతేకాని మఱియొకటి కాదు.

(కొట్టులోనుండి) తలుపుతీయని యెడలఁ దలఁ బగులఁగొట్టెదను. చంపెదను. డొక్కచీల్చి రాలుకొట్టెదను. చిట్టినారకమ్మను జీల్చినట్లు చీల్చెదను. జాగ్రత్త ! జాగ్రత్త ! (గట్టిగా) అక్కడ నెవరు ! మాటలాడరేమి ? ఎవరయ్యోయి !

సుంద — బాబయ్యా ! క్రొత్తరాణితోఁ గల్యాణసుఖము బాగుగా ననుభవించుచున్నావా ? ఇంక ననుభవింతువు.

(కొట్టులోనుండి తలుపు గట్టిగఁ దన్నుచున్నాఁడు.)

సుంద—లోనుండి తలుపు తన్నుచున్నాఁడు. నలుపది రానున్న తరువాత నెన్నిపాట్లుపడకుండఁ బదునాలుగేండ్లకొ్రొత్తపెండ్లికూఁతురు ప్రక్కలోనికి వచ్చుననుకొంటిరి ? బాబూ ! తన్నుకొనుఁడు. ఇంక ను దన్నుకొనుఁడు.

(కొట్టులోనుండి) ఇంక నేనఁబవలేనుగోయి ! గొంతుత్రాళ్లు తెగి పోవుచున్నవిరోయి ! తలుపుతీయగోయి ! తీసినవారి కర్ధరాజ్యమి దను. ఓహోయి ! ఓహోయి !

సుంద—(తనలో) రాజా ! తలుపుతీసినవారికి రాజ్యమి దవా ? ఇచ్చినయెడల నీకముందు రాణులసంపాదనమేటులు ? చెకుముకి కాళ్లవారు—ఈ చెంపవెంప్రుకలవారు—నీ మొఖాసాను జూ వచ్చినవారనుకుంటివా ?—నీ మొగమును జూచివచ్చిన వారనుకొంటివా

(కొట్టులోనుండి గట్టిగ) ఏమిరోయి ! ఎవరురోయి ! ఎక్క రోయి ! అయ్యయో ! అయ్యయ్యో ! రాజ్యమీయకపోయిన యెడ జండాలుఁడనురోయి ! ఇదిగో ! వచ్చుచున్నాను.

సుంద—(తనలో) రాణినివదలుమనన్నప్పుడే యంతవా వైతివి. ఇప్పుడు దిరుగననుట యెందులకు ?

ఇందు—సుందరీ ! పాపము. గట్టిగఁజిక్కుకొనినాఁడుసుమా

సుంద—రాజా ! రాజ్యమిచ్చుచుంటివి. సంతోషమే ఉం కొన్న యీపావటుపటాలమంతయు నెవరికీయుఁదలఁచితివో ఘనిలోఁబ యదిగూడ నిప్పుడే తేలనీ. పూర్వార్జితమైన ప్రభుత్వమొకయెత్తు— స్వార్జితమైనపెటత్వమొకయెత్తుకాదా ?

(కొట్టులోనుండి) ఎవరురోయి ? నాగొంతాగ్చుకొనిపోవుచు దోయి ! కనులు చీఁకటులుపడుచున్నవిరోయి ! ఇఁకను వచ్చ

దును. బాబూ! బాబూ! ఎవ్వరైనవచ్చి రక్షింపరో! ఘుబాబూ వా! వా! వా! వా!

ఇందు—సుందరీ! అదియేమి వా వా వా యనుచున్నాఁడు.

సుందర—అమ్మా! నోటిపైఁజేవైచి వా వా వా యని కొట్టుకొనుచున్నాఁడు.

ఇందు—ఇఁకఁ దలుపుఁ దీయఁదగదా? చచ్చిపోవుదుననుచున్నాఁడు—

సుందర—ఇంతటితోఁ జచ్చుటయేనా? ఇంక నెందఱినేచ్చింపవలయునో? ఎందఱిని జంపవలయునో? చావుమాత్రము సకాలమున వచ్చుటయెంతయదృష్టమమ్మా! చత్తునని చావనివాఁడెప్పటికప్పుడే యనుచుండును. కిమ్మనకుండఁ గ్రిందివారినిగడతేర్చుచుండును. ఈతఁడు చావినను జచ్చువాఁడుకాఁడమ్మా! నీపసపుతాడుగట్టిది. సందేహింపకుము. చచ్చుటయే! ఈగండమేదో గడచినయెడల నింతకంటె ద్విగుణీకృతమగు తేజస్సుతో నేకచ్ఛత్రముగఁ బసువులపాకలలో—గుఱ్ఱపుశాలలలో—కుక్కలకొట్లలోఁ గొత్తయంతఃపురముల గట్టించి వీరభోగవసంతరాయఁడై విశ్వమంతయుఁ బాలింపవలయునని యీతనిమనసులో నున్నదికాని యన్యథాలేదు.

ఇందు—ఇప్పటికైన బుద్ధిరాలేదనియే నీయభిప్రాయమా?

(కొట్టులోనుండి) అయ్యయ్యో! మహాపతివ్రతయై—పరమశాంతమూర్తియై—ప్రాణప్రియయైన పాతరాణిని గొంతుకోతలమోసకత్తెయైన క్రొత్తరాణికై యుపేక్షపడివిడిచితిని. అదే! విడిచెదనని యంటిని. ఆపాపమే నన్ను నేలనడఁచికొట్టినది. నాకుబుద్ధివచ్చినది. బ్రదికి బయటఁబడి నారాణిని నేను జూచుటసిద్ధించునెడల నాకు పాదాక్రాంతుఁడనగుదును. ఆమెయే నాకు సహధర్మచారిణి. అట్టి

యిల్లాలిని బెట్టిన క్షోభమే నన్నింతవట్టునకుఁ దెచ్చినది. ఇంకనంత ములో నున్న పశువులమందను సంతకో, వస్నెము నకొ తోలి వలసి..

ఇందు—వింటివా ? బుద్ధినచ్చినదికద !

సుంద—అయ్యా ! రాజగారూ ! ఈకగుపు కాలములో నూట యేఁబదిగురు దాసిముండలను జేరఁదీయఁగలసాహసంతు లెవ్వరు ! ఎక్కడనో యుద్ధాలు జరుగుచున్నవంటే ! యుద్ధసాహాయ్యముగా వీరినందఱనటకుఁ దోలిపెట్టుము. నీపీడదీఱును. వారపీడ నీఱును. దేశపుఁ బీడదీఱును.

(కొట్టులో నుండి) నన్నురక్షించుట మనుష్యమాత్రునిచే గాదు. ఓ వెంకటేశ్వరుఁడా ! ఓ యేడుకొండలభగవానుఁడా ! రక్షించు రక్షించు ! ఉన్న నూటయేఁబదుగురుంపుడుకత్తెలమీఁదనున్న బం బంగారువస్తువులన్నియు లాగుకొని నీకు నిలువుదోపుగా నిచ్చెద బాబూ ! నాతండ్రి ! రక్షించు. రక్షించు. రక్షించు !

సుంద—అమ్మా ! వింటివా ? బుద్ధియెంతవఱకు వచ్చినదో ప్రక్కసేవ చేసినపాడుముండల సరకులు లాగుకొని యేడుకొండ యాయనకిచ్చునఁట !

(కొట్టులో నుండి) ఓ ! ఊడుగులమ్మా తల్లీ ! రక్షించు. రక్షించు ! రక్షించు ! నీకు పెండ్లిఘటము చేయించి యుగ్గించుకొందును మూఁడు వేఁటపోతులు, నూఱుకోళ్లు, నాల్గుబండ్లనైవేద్య మిచ్చుట మ్రొక్కుకొందును. తల్లికిఁ దయయున్నఁగాని తండ్రికిరాదు. నీవై వేంకటేశ్వరునితోఁ జెప్పి రక్షించు. రక్షించు ! మాతల్లీ !

సుంద—ఆహా ! వింటివా ? పాండిత్యప్రకర్షము. ఊడుగుల మ్మకు వేంకటేశ్వరుఁడు మగఁడట. అంతటితో సరిపెట్టినాఁడు. వెం కటేశ్వరుఁ డూడుగులమ్మకు భార్యయనఁదగినవాఁడు. ఇక్కిపండితప్రభు

ఇట్టి భాషాభిమాని—ఇట్టివిద్యాపోషకుఁడు—దేశీయుల మహాపుణ్యమున నవతరించినాఁడు. బాబయ్యకుఁ గవీశ్వరుఁడని పేరుచెప్పసరి కొడలు మంట

ఇంద్రు—సుందరీ! అతనిప్రార్థనావైఖరి మనకుబాగుగా లేకున్నను, బశ్చాత్తప్తతమాత్రమాతనికిఁ గలిగినట్లగపడుచున్నది. దైవమును సరిగాఁ బ్రార్థింపఁగలవాఁడెవ్వఁడు? మనుజప్రార్థనలకన్నిటికి వంకరటింకర ప్రారబ్ధము తప్పనేతప్పదు. కాని కావలసినది పాపపశ్చాత్తాపము. అదియాతనికి బాగుగాఁ గలిగినట్లుతోఁచుచున్నది. సత్యమగునా కాదా?

సుంద—అతనిబాగుతో సంబంధమునీకు. కాన నీకుఁదోఁచుటయే ప్రధానము. సత్యమాకాదా యనుసందేహమక్కఱలేదు.

(కొట్టులోనుండి) ఎవరయ్యోయి! ఎవరయ్యోయి! ఏ ఏ ఏ ఏ (ఏడ్చును)

ఇంద్రు—అదేమి? ఏడ్చుచున్నాఁడాయేమి?

సుంద—ఒక్కఁడు గాదిలోఁగూరుచుండి చేయవలసినపని యంతకంటెనేమున్నది? అంతఃపురములోఁ గూరుచుండిన యమ్మవారలందఱేమిచేయుచున్నారు.

(కొట్టులోనుండి) ఇఁక నాపని యింతే కాఁబోలునోయి బాబూ! బాబూ! ఎవ్వరును నా మొఱ వినరా? ఏదేవుఁడు నడ్డుపడఁడా! మొసలిపీకిన గాడిదెనుగాచిన మాతండ్రీ! రక్షింపవా? నాయనా! ఏఏఏ (గట్టిగ నేడ్చును)

సుంద—వింటివా? బాబయ్య కలియుగవ్యాసుఁడు. ఖరేంద్రమోక్షణగాథ నుపపాదించుచున్నాఁడు.

ఇంద్రు—సుందరీ! పాపము. గట్టిగా నేడ్చుచున్నాఁడే. ఇఁకఁ దలుపు తీసెదను. నీవు పొమ్ము.

సుంద—అమ్మా! బహుజాగ్రత్తగాఁ బ్రవర్తింపవలయును జుమా! ఆతనిమనస్సునకెంతమాత్రమును సందేహముగలుగున మాటలాడకుమా!

ఇందు—ఇదివఱకు నీయొద్ద నొప్పుఁజెప్పిన పాఠమే కాదా?

సుంద—నేనిఁకఁ బోవుదును. (నిష్క్రమించును.)

(కొట్టులోనుండి) అయ్యయ్యో! ఇఁకఁ జచ్చిపోవుట నిశ్చయము బాబూ! ఎంత స్వేచ్ఛగా బ్రదికినవాని కెంతయిబ్బందులు వచ్చినదిబాబూ! ఎంత వేడుకతో బ్రదికినవాని కెంతదుర్మరణము వచ్చిన బాబూ! కృష్ణమూర్తిలాగున దినములు వెడలఁబుచ్చిన చక్రవర్తి రావలసినచావిదేనా? ఏఏఏ (గట్టిగా నేడ్చుచు.)

ఇందు—నాథా! విచారింపకుము. వచ్చుచున్నాను.

(కొట్టులోనుండి) ఎవరు? క్రొత్తపెండ్లికూఁతురవే! ఆ! ఆ! ఇంతయాలస్య మేలచేసితివి? దయయుంచి త్వరగఁ దీయుము.

(ఇందుమతి బీగముతీయఁగ సేతుమాధవుఁడు

కొట్టునుండి పైకివచ్చి)

సేతు—(తనలో) బ్రదికితిని బాబూ! బ్రదికితిని. బాబూ (ప్రకాశముగ) అయ్యో! ఎవరు? ఎవరు? నారాణివే! ఇందుమతి దేవివే! నీవిచ్చటి కేలవచ్చితివి?

ఇందు—ఏలవచ్చితినో తెలియకున్నదా? వచ్చి యేమి తినో యంతకంటెఁ దెలియకున్నదా? చెప్పిననైనఁ దెలియునా?

సేతు—(రెండుచేతులు పట్టుకొని) నాప్రాణము రక్షించిదానవు నీవేనా? ఆహా! ఎంతమహోపకారమొనర్చితివి! నీ డల దుర్మార్గుఁడనై ప్రవర్తించు నాయెడల నెంతదయగలదానవైతివి తీయఁగొనినవి చేతులు కావు, నన్ను తృణముంపుదును. నే నింతలో

మొదల నఱచియఱచి గొంతునరములు తెగి, మఱియొకఁ గొంతసేప
టికి మరణింపవలసినవాఁడను. మృత్యుముఖమునుండి నన్ను వెలికిఁ
దీసితివి. కాని నీవిక్కడి కెట్లు రాఁగల్గితివో చెప్పవా ?

ఇందు — నిన్ను వెలికిఁదీయవలదా ? నీప్రాణమువలన నాకు
సుఖములేకున్నను, నీమరణ మాపత్తుగనెంచి క్షోభమొందవలసిన
దానను నేనొక్కతెనేగాదా? మిగిలిన చెంపకొప్పులవారికిఁ బండ్లకప్పు
లవారి కందఱకేమి ? అంతఃపురములలోఁ గోడిపలావ్రులని కోకోక
ములని కిలకిలలాడుచుఁ, గిచకిచలాడుచు నీవు చచ్చితివో బ్రదికియే
యుంటివో యని యెంచకుండ నాడుచుఁ బాడుచుఁ గాలక్షేపము
చేయుచున్నారే ! వీరందఱ నేమిచేయవలయునని తెచ్చితివి ? ఒకొ్క
క్కతె గాడుగేదె యంత స్వరూపముగలదై యున్నదే ! నీవు చూడఁగ
వామనస్వరూపుఁడవే ! దుర్బలశరీరుఁడవే ! మిగిలినవన్నియు నటుంచు
ము. ఒకదానితరువాత నొక్కతెగా నీనూటయేఁబదుగురు ముచ్చట
తో నిన్ను ముద్దుఁబెట్టుకొనుట సిద్ధించునెడల నూఁపిరిఁతిరుగక యరగం
టలోఁ జత్తువే !

సేతు — ఇఁకఁ జెప్పకుము. నాకు సిగ్గువచ్చినది. బుద్ధివచ్చినది.

ఇందు — సిగ్గువచ్చినవాఁడవుకదా ! బుద్ధివచ్చినవాఁడవు కదా !
క్రొత్తగా నొక్కపెండ్లికూఁతు నేల తెచ్చితివి ?

సేతు — దానిమూలముననే బుద్ధివచ్చినదని నాయభిప్రాయ
ము. నేను దిన్నగఁ జెప్పలేకపోయినాను.

ఇందు — ఆమె యెవతె ? ఆమెదేయూరు ? ఆమె తలిదండ్రు
లెవ్వరు ?

సేతు — ఆసంగతులు నాకేమియుఁ దెలియవు. వారు — మేము
గూడ — నదియేదో క్షేత్రము — పేరు నోట నాడుచున్నది. అక్కడనొక్క

సత్రమున బసచేసితిమి. ఆమె క్షత్రియకాంతయనిమాత్రము కర్ణాగ వింటిని. ఆమె ప్రమాదవశమున నాకంటఁబడినది. తరువాత నే పాట్లుపడి యామెనుదెచ్చి ప్రాంతహావేలిలో నుంచితిని.

ఇందు—ఆమెయొద్ద వంటచేయు సేవకునొకనిని నీవు చంపఁటే !

సేతు—అయ్యయ్యో ! నీకెట్లు తెలిసెను ? మఱియెవ్వరియునన లేదుకదా ! చూడు. ఆబండిలోనున్నదాని వెలపలికిఁ దీసికొనిపటలో నేనో కొంతగడబిడయైనది. అతనిని బుద్ధిపూర్వకముగా నరును జంపలేదు. ఆతనిమీఁదవైర మెవరికున్నది ? చూడు ! ప్రాణమనఁగా నెంత ? కణతపై టప్పుమనుసరికి గసచెను ! ఆసందడిలో నెవరికా లెక్కడఁదగిలెనో, యెవరిచేయి యెక్కడఁదగిలెనో యెవరు చెప్పఁగలరు ? దిక్కుమాలినశరీరాలు ! నిత్యమహాపాయములకుఁ గూకొన్నవే కాదా ? నీవు వచ్చి రక్షించితివి కాని నేనసరికి తారునఁ జయుండవలసినది. అంతయే మనయాయుస్సులు ! ఏమని చెప్పుదును కాని, నీకీరహస్య మెట్లు తెలిసినది ?

ఇందు—ఏమియుఁ దెలియకుండనియెడల, నెంతయుఁ దెలికుండనియెడల నేనిచ్చటి కెట్లురాఁగలిగితిని ?

సేతు—ఆప్రశ్నము రెండుమారు లడిగినను జెప్పకపోతివే !

ఇందు—నేనేల చెప్పవలయును ? నీకు నేను ధర్మపత్నినిగదా నీకు నాయొద్ద నెంతమాత్రమును రహస్యముండవలసినది కాగదా ! నీయంత నీవే నాకు దాఁపఱికములేకుండ నంతయుఁ జెప్పసినదే—నాకుఁ దెలిసినతరువాత నైన నింక మూసిపెట్టుకొనుట యెందులకు ? బుద్ధివచ్చినదంటివే ? ఇదేనా బుద్ధివచ్చుటకు లక్షణము ?

సేతు—నన్ను క్షమింపుము. నే నంతయుఁ జెప్పెదను. క్రొత్త కాంత నిక్కడకుఁ దెచ్చినపిమ్మట మా సంధానకర్త యైన మాఘు నామె యొద్దకు రెండుమూఁడు పర్యాయములు పంపితిమి. ఆమెయు, సుందరి యను పేరుగల నామె దాసియు మొన్న రాత్రి కాఁబోలును—మన యుద్యానవనములోనికివచ్చిరి. ఆమె నాతో మాటలాడలేదు. సుంద రియే మధ్యస్థురాలై యామె యభిప్రాయము తెలిపినది. ఒకటి రెండు దినములలో వివాహము జరిగించుటకు స్థిరపఱచితిమి. ఆమెను రాణిని జేయుట కొప్పుకొంటిని. బుద్ధిలేక నిన్ను వదలుటకుఁ గూడ సమ్మతించి తిని. నీవు కోపపడవలదు.

ఇంను—నేను శాంతిచెడినదాన నైనయెడల నీవింతవిధము చెడి యుందువా ? తరువాత,

సేతు—తరువాత, విశ్వాసార్థముగా రాజముద్రికాంగుళీయ కమును వారుకోరఁగనిచ్చితిని. ఆ రాత్రికి వారువారిబసకుఁబోయిరి. మఱు నాఁడు సాయంకాలమున మాఘుఁడు వచ్చి క్రొత్తరాణి సుందరిచేతి కిచ్చి పంపినదని యీ లేఖను నాకిచ్చెను. ఇదిగో! చీఁకటియగుటచే నిది చదువుటకు వీలు లేదు. కాని దీనిలోని యంశములివి.

"రాజుగారికి క్రొత్తరాణి యనేకనమస్కారములు. నిన్నరాత్రి మనము కలసినప్పుడు మీరాజముద్రిక నాకిచ్చితిరి. రాజ్యమిచ్చినట్లు సంతసించితిని. తిరుగ మీదర్శనము నపేక్షించియుంటిని. మీతోఁట లోనికి నేను రాను. అక్కడ పనిజులసందడి యెక్కువగానుండును. మీరు మా యింటికిని రావలదు. మా సందులో మా యింటికిఁ గుడివైపున నైదవగుమ్మముదాఁటఁగఁ బెద్దతోఁట యున్నది. వీధిగుమ్మమునకు మిగుల దూరముగ నొక కొట్టున్నది. ఆకొట్టులోనికి మీరు రాత్రి పదు నొకండుగంటలకు రావలయును. మిమ్మక్కడఁ గలిసికొందును. సేవకు రాలు, క్రొత్తరాణి."

ఇందు—(తనలో) ఈయుత్తరమే సుందరి వ్రాసి రఘునాధునికిచ్చినది. (ప్రకాశ) అది క్రొత్తరాణి వ్రాసినట్లు నీకేలయనమ్మకము ఆమెవ్రాలు నీవెఱుంగుదువా ?

సేతు—వ్రాలు గేలు నే నెఱుంగను. నే నిచ్చిన ముద్ర యాయుత్తరము క్రింద వేయఁబడియున్నది.

ఇందు—(తనలో) అదియు సుందరి చేసినపనియే. రాజమూర్తి గ్రహణమునకు బోనునకుఁగట్టిన మినుపరొట్టెయుదియే. (ప్రకాశ) తేపో మెల్లుండియో వివాహము స్థిరపడినదికదా ? గతించినరాత్రి, నీతో నామెమాటలాడ లేదనియే చెప్పితివికదా ! ఇంతలో నింతతొందరతో నిన్నేలరమ్మనవలయునను సందేహము నీమనస్సునకుఁ గలుగ లేదా ? అది కాక యామె యీగ్రామమునకుఁ గ్రొత్తకదా—తన యుంటికిఁ గుడివైపున నైదవగుమ్మమునియుఁనటుఁ బెద్దదొడ్డియనియు, దానిలో నొకకొట్టనియు, దానికి వీధిగుమ్మమునకు దూరమనియు నిన్నిసంగతు లామెకెట్లు తెలిసినవని నీకుసందేహము కలుగ లేదా ఇంతయోజన లేకుండ దుడుకుగు మకున గాదిలోనికిఁ గంకణాలముల్లె మునకై సిద్ధపడితివా ? ఎంతతెలివితక్కువపని చేసితివి !

సేతు—సుందరి గండ్రముండ లే. అదియెంతపని చేసినను జేయఁ గలదని నమ్మవలసినదే లే. అదియేదికనికట్టినను గనిపట్టగలదు. నీ దానివంటిదానిని జూచియుండవు.

ఇందు—(తనలో) అమ్మయ్యో ! నిజముపలికినాఁడు. గుంలదటిపోయినవి ! ఆహా ! ప్రమాదవశమునఁ బలికిననైనను సత్యము కున్నతీక్ష్ణత యవర్ణ్యముగదా !

సేతు—ఇందుమతీ తెలివితక్కువపనియని వేఱ చెప్ప నేల బుద్ధి శృంగారరసమునకు నేతముపెట్టన్నసంగతి మతకర్తలంద నొప్పుకొనినమాటయే కాని మఱియొకటి కాదు లే. ఇది పొరుమపరిధా

మైన లౌకిక వ్యాపారముగాని దైవచింతాప్రధానమైన తత్త్వమార్గము కాదని ధర్మశాస్త్రము ఘోషించుచునేయున్నది.

ఇందు—ఏమి? ఇదిపౌరుషమా? మగువలమందనడుమను గూరుచుండుట మగతనమునకు లక్షణమా? ఆపత్తులలో సహనము గలవాడు మగవాడు. ఆలియభిమానమును గాపాడువాడు మగవాడు. అరిషడ్వర్గమును జంపువాడు మగవాడు. అంతయే కాని కంట బడినదానినెల్లఁ గట్టుకొని పంచపాళిలో పరదాచాటునఁ బస్తుపెట్టించి యీలాగునఁ బదిపన్నెండిండ్లో, పదిపదునాలుగులోఁ గుంచములలో గదుల్లుపోసినట్లు నగరులో బిగింపుగాదట్టించియే నిముసమున కెవరు లాగుదురోయని యెప్పటికప్పుడే మొగము చాటువేసి యందఱు నేడ్పించి తాను గాదిలోఁ గూర్చుండి వీరందఱకంటె గట్టిగానేడ్చు వాఁడు మగవాఁడా?

సేతు—ఏదో జరిగినదన్నివాళ్ల త్యాతపశ్చాత్తాపముతో సనిర్వచ నీయ తేజస్సుతో జరుగనే జరిగినది. మగతనపుఁబ్రశంస యెందులకు? అదియింక వదలుకొంటిమి కాదా? మాఘుఁడిచ్చిన యీయుత్తరమును నమ్మి నిన్నరాత్రి పదకొండుగంటల కింతునఁబ్రవేశించితిని. తెల్లవారి నది. తిరుగ సాయంకాలమైనది. ఇప్పుడీపలుకువచ్చితిని. ఇప్పుడేమగంట లగునేమో?

ఇందు—అయియుండును. క్రొత్తరాణి నిన్నుఁ గలియుటకు గాఁ దలఁచియే నిన్నికొట్టులోనికి రమ్మనెనని నీకునమ్మకమా?

సేతు—క్రొత్తరాణి దొంగ. దానిదాసి సుందరి దానికన్న దొంగ. నిన్నరాత్రి వారుమేముకలిసినప్పుడే కొంతసందేహము మన స్సునకుఁ గలిగినది. కాని పెండ్లితొందర—ప్రబలముగా నుంటచేత,

ఇందు—అదిదొంగయని నీవెట్లు చెప్పఁగలవు?

సేతు—నేను గదిలోఁ బ్రవేశించిన పదినిముసములకు వాఁకిటిలో గొంచె మలికిడియైనది. సరే; అదివచ్చినదిదె దాయని సంబరపడి పండుకొన్నవాఁడను లేచి కూరుచుంటిని. ఇంతలో గప్పుననున్నది.

ఇందు—అదేమి ?

సేతు—తలుపునకుఁ బైవైపు గొండ్లెము పడినది. అంతలో టక్కున బీగముపడినది. ఒక్కనిముసమగునరికి పెకపెకమను సవ్వడి వినఁబడినది. పరిహాసమున కిట్లామె చేసినదేమోయని యనుకొని బతిమాలుకొంటిని. పారితోషకము లాసపెట్టితిని. భయపెట్టితిని. అఱచితిని, మొత్తుకొంటిని. ఒక్కరీతిగా నప్పటినుండి నీవువచ్చి తలుపుతీయువఱకు నెత్తినోరు కొట్టుకొంటిని. ఇప్పుడుపోయి దానిని బత్తివధము చేయింపక యూరకుందునా ? రమ్ము.

ఇందు—ఉండుము. ఇంకను వెలుపలసందడిగా నున్నది. ఈ దినము సతకూడదు. ఒక్కయరగడియసేపుతాళుము. నీవు చెప్పవలసిన గాథ యేదోయైనది. ఇఁక నేనుజెప్పవలసినదేదో వినుము. మూఁడుముక్కలలోఁ జెప్పెదను. నిన్నరాత్రి నీతో మాటలాడఁ దలఁచి నీగదికి వచ్చితిని. నీవులేవు. పండ్రెండైనది. ఒంటిగంటయైనది. రెండయినది. నీవింక రాలేదు. మూఁడుగంటలుకూడవింటిని. నీవురాలేదు. నాప్రాణము చెదరిపోయెను. ఏమైన మోసము జరిగియుండునేమోయని యెంచి ముసుగువైచికొని నాల్గుగంటలసమయమున దాసిదోడుతీసికొని క్రొత్తరాణి మహలికిఁ బోయితిని. ఆమె గాఢముగా నిద్రించుచుండెను. లేపి నాభర్త రాజుగా రేరని బాకుఁదీసి పొడువఁబోయితిని. అప్పుడు మీపూర్వరాత్రి సమావేశపుసంగతి నీకు వ్రాసినయుత్తరముసంగతి యుత్తరమునకు నీవిచ్చిన రాజముద్రిక నమ్మికకొఱకు వేసినసంగతి, వదినమ్మ గారిలోనికి వేంచేసినసంగతి, యామె సుందరిచేఁ దాళము వేయించిన సంగతి చెప్పినది. తలుపుతాళము దానియొద్దఁ దీసికొంటిని.

అప్పటికి బల్లునఁదెల్లవాఱిపోయెను. ఎటులో గోటలోఁ బడితిని. అంతః పురరాణిని బగలు నేనిక్కడకువచ్చుటకు వీలు లేదుకదా! మాటిమాటికి రిని బంపుట కెవ్వరికిఁ దెలియఁదగినయంశము కాదుకదా! ఏమిరా భగవంతుఁడా యశ్రు సాయంకాల మగుపఱకు వేఁచియుండి యిప్పుడే వచ్చి తలుపుతీసితిని.

సేతు.—నీవు నామర్యాద కాపాడితివి. నాప్రాణమును రక్షించితివి. నాశత్రువును శిక్షించితివి! నీకు సాష్టాంగనమస్కృతికన్న నే నేమిచేయఁగలను? (నమస్కరించును.) ఆహా! ఎంతపుణ్యాత్ములాలవు!

ఇందు.—(తనలో) ఆహా! మోస మెంతపనిచేసినది! భర్తను వశపఱచుకొని కనుసన్నలఁ ద్రిప్పుకొనుచున్న యిల్లాండ్రిందఱు మోసముచేతనే యట్లు చేయుచున్నారేమో? శాంతివహించినంత కాలము నాభర్తకు నాపైఁ గోపము హెచ్చిపోవుచునేయుండెను. బతిమాలుకొనినంత కాల మతనికి బిఱ్ఱబిగింపధికముగనేయుండెను. ఒదిగియడఁగి మడఁగియున్నంత కాల మాతఁడు నెత్తెక్కి త్రొక్కుట వదలనేవదలఁడయ్యెను. నీవే గతియని మ్రొక్కినంత కాలము కోటనుండి నన్ను గెంటివైచుటకే ప్రయత్నించెను. మోసమునఁ బట్టఁదీసి బాధించుటతోడనే భర్త స్వాధీనుఁడయ్యెను. నేనే ధర్మపత్నినైతిని. క్రొత్తపెండ్లికూఁతురు శత్రువయ్యెను. ఆహా! మోసమెంతమహిమగలదిరా! వగలాఁడియైన యాఁడుదిగాని భర్తను వశపఱచుకొనలేదు కాఁబోలు! టక్కులాడియైనయిల్లాలు గాని మగనికి ముక్కుత్రాఁడు పోయలేదు కాఁబోలు! ఈకాలములో నాఁడుది యట్టిదైన జనులకలవిగా నుండవలయును గాఁబోలు! కాక యట్టిదానినే గాని మగవాఁడు పెత్తించఁడు కాఁబోలు! వాని నైజమది కాఁబో. ! ప్రపంచజ్ఞానము లేని నా కేమైనఁ దెలియునా? యేమైనా?

తు—అటులైన నన్నేమిచేయుమంటివి ? నాకిన్ని తెలియవు. నీవు నన్నిట్లు నడువుమని చెప్పుము. అట్లు నడువనియెడల క్షత్రియవంశ జాతుఁడనుగాను.

ఇందు—ఆమెయెడల గౌరవభావముతో నీవుండవలయును.

సేతు—అట్లే.

ఇందు—(తనలో) పదిపదునాలుగేండ్లవయసు చిన్న బంగారుబొమ్మ—ఎవ్వరిదానవని యడిగిన నేమియుఁ జెప్పదు. మాటలాడదు నన్ను చూచి గర్వమైనఁగానదు. మీయింటికిఁ బొమ్మన్నఁ బోదు. నాయంతఃపురములో బెట్టుకొంటిని. ఈతఁడు దానిని దెచ్చుటయేమి ? అది నన్ను వదలకుండుటయేమి ? ఈతనికి దానిమీఁదవదలినది కాని నాకేఋణసంబంధమో కాని యింత బాధించుచున్నది.

సేతు—ఇప్పుడామె యెచ్చటనున్నది ?

ఇందు—నాయంతఃపురములోనికిఁ దెచ్చిపెట్టికొంటిని.

తు—అట్లుచేసితివేల ?

ఇందు—దానియింటికిఁ బొమ్మనఁ బోకుండునన్న నేమిచేయవలసినది ?

సేతు—ఎందుచేతఁ బోదు ?

ఇందు—ఏమని చెప్పను ? ఆమె యట్టి యభిమానవతి—ఆమె యట్టి యభిమానవతి—ఆఁడుదాని యభిమాన సందర్భము మగవానికిఁ జెప్పఁదగదు. చెప్పిన నది యాంతనికి బోధపడునది కాదు. అది యాఁడుదానికిఁ దెలియఁదగినదే. అది యాకాశముకంటె నధికమైనది. సూదిమొనకంటె సూక్ష్మమైనది.

సేతు—అట్టి మహాభిమానసంపన్నురాలిగా నేను దెచ్చినది ! ఆహా ! నాపాపమున కవధియున్నదా ?

ఇందు—ఇప్పటికవి కవధియేయున్నది. పాతివ్రత్యపవిత్రముచే నామె ప్రాణత్యాగము చేయునెడల మాత్రము నీపాపమున కవధియుండదు.

ఇది పంచమాంకము.

శ్రీ

# ముద్రిక.

---

## షష్ఠాంకము.

---

ప్రదేశము—అంతఃపురము.

ప్రవేశము—మానవతి, ఇందుమతి.

ఇందు—అమ్మా! నీపేరైనఁ జెప్పఁగూడదా?

మాన—మొదటఁ జెప్పదగిన పేరే—మాపు మచ్చయు లేని పేరే—కాని, ఇప్పుడట్లు కాదు. అమ్మా! అవిధేయతను క్షమింపుము,

ఇందు—క్షమింపక నేను జేయవలసినదేమున్నది? నామనస్సుండఁబట్టక యేదో యడిగితిని.—నేను పైకిఁ జెప్పఁజాలని యాత్రములో—నామనస్సునకైన నేమో యర్థముకాని యాందోళనములో అమ్మా! అటులు కంటనీరు బెట్టుకొందువేమి? ఏమో నాకడుపులో నున్న కష్టమును జెప్పుకొనుచుంటినిగాని నీమనస్సునకేమైన బాధ నీయలేదుకదా!

మాన—నీకడుపులోఁ గష్టమే నామనస్సులో బాధయైనది (ఏడ్చును.)

ఇందు—అమ్మా! అమ్మా! ఎందుచేత? ఎందుచేత? చెప్పవా? చెప్పవా?

మాన—ఏమియు లేదు, నేను జచ్చిన వెనుకఁ దెలియును లే (ఏడ్చును.)

ఇందు—అట్లేచెప్పెదవేమి? మా అమ్మా! నాకు దడ యెత్తుచున్నది. చెప్పవా? చెప్పవా? చెప్పకున్నయెడల నాతోడే.

మాన—నేను జెప్పఁదలఁచుకొనలేదు. చెప్పినయెడల నీతోడే.

ఇందు—ఎవరువారు!

(నేపథ్యమున)

అమ్మా! మీనాయనగారియొద్దనుండి మాధవుఁడనువాఁడు వచ్చినాఁడు. మీతో మాటాడునఁట. లోనికి రమ్మనిసెలవా?

ఇందు—నన్నుఁ బెంచి పెద్దదానిఁ జేసిన మాధవుని గూర్చి యీ క్రొత్తయనుజ్ఞయేల?

(నేపథ్యమున) క్రొత్తరాణిగారు వ్రాసిరని యట్లుచేయవలసి వచ్చినది.

ఇందు—అభ్యంతరములేదు. ఈప్రక్కనే యాతనితో మాటలాడుదును. వేగరమ్మనిచెప్పు.

(మాధవుఁడు ప్రవేశించును.)

ఇందు—మాధవా! అక్కడ నేయాఁగుము. మిగులఁ బెద్దవాఁడవైతివే! నీవంటిపెద్దవాని నిటకుఁ బంపవలసిన యావశ్యకత మాతండ్రిగారి కేమిగలిగినది?

మాధ—మీతల్లిగారానడుమ మిగులరోగపడినారు. ఆమెకు నిమ్మళముగా నున్నయెడల నొడలిమీఁది నగలన్నియు శ్రీపురమహాలక్ష్మికిచ్చెదనని మీ చెల్లెలు మ్రొక్కుకొన్నారు. అమ్మకు నిమ్మళముగా నున్నతరువాత మ్రొక్కుచెల్లించుకొనుటకమ్మాయిగారు కొలఁదిపరివారముతో బయలుదేరినారు. ఇప్పటికివఱకుఁ దిరుగనింటికి రాలేదు.

ఇందు—అయ్యో! అయ్యో! ఎందుచేత?

మాన—(గట్టిగా నేడ్చుచు) మాధవా! మాఅమ్మగారు నిశ్శేషముగా నున్నారుగదా!

ఇందు—అయ్యో! అయ్యో! మాయమ్మ గారనునన్నావేమి?

మాధ—(తొందరతో నెదుటకువచ్చి) అమ్మా! మానవతమ్మా! ఇచ్చట సురక్షితముగా నున్నావా? తల్లీ!

ఇందు—అవును. ఇచ్చట సురక్షితముగా నున్నది. కా, మాధవా! నీవుపోయి రాజుగారి నొకపదినిముసములలో నేనురమ్మంటినని చెప్పుము.

మాధ—చిత్తము. (పోవును)

ఇందు—అమ్మా! నీవునాచెల్లెలగు మానవతివేనా తల్లీ! మా అమ్మా! ఎంతదాన వైతివి! నిన్నెన్నాళ్లకుఁ జూచితినమ్మా! తుతుదకు నాభర్త నీకుఁగూడ నిట్లపకృతి గావించినాఁడా? మాతల్లీ నావంక నొకసారి కన్నులు తెఱచిచూడుము.

మాన—(తలపైకెత్తును.)

ఇందు—(ముద్దుపెట్టుకొని) చెల్లెలా! నిన్నుఁ జిన్నతనములో ముద్దుబెట్టుకొననేలేదు. అయ్యయ్యో! నేనెంతపాపాత్మురాలను! ఏ అత్తవారింటికి వచ్చినతరువాతఁ బిరుగఁబుట్టినింటి మొగమేచూడమైతిను. ఏమిచేయుదును? నీవుపుట్టితివని పెరుగుచుంటివని వినుట కాని రాకలా పోకలా యేమున్నవి? అమ్మ కంతరోగమువచ్చి రాపీలు లేకపోయెను. చెల్లెలా! అమ్మకు విషముగా జబ్బుచేసి కాఁబోలునేమి?

మాన—అమ్మ బ్రదుకునని యెవ్వరైనననుకొనిరా? పెద్దక్క దానిని జూడనుగాఁబోలునని యెన్నిమాఱులోఁ గన్నుల నీరుపెట్టుకొన్నది. నేను బయలుదేఱి వచ్చుతరుణాన నైన ఖామాతఁ గ్రిందికి దిగ జూచుట

మీాయక్క వచ్చునేమో దానిని నీవుచూడగానే క్రొత్తయని సందే హించి దూరదూరముననుండక దానిని నామూరుగా గట్టిగాఁ గౌఁగి లించుకొనుమూయని నాకెన్నిమాటులో బోధించినది.

ఇందు — పాపము! నేనేమిచేయఁగలను? నాకుమాత్రము వచ్చి చూడవలయుననిలేదా? మాఅమ్మా! ఇప్పటికైన నిన్నుఁ జూచితిని. ఏసాధారణులు కొంపలలోఁబడినప్పుడే యిట్టి యచ్చటలకు ముచ్చటలకు నవకాశమున్నది కాని రాజసంబంధముల కెల్ల నీబాధ కొలఁదిగానో గొప్పగానో యుండనేయున్నదమ్మా! కాని భాగ్యాలకు భోగ్యాలకు — గడబిడలకు దడబడలకు — రాజసంబంధములకొలకే పే త్రుపడుటకూడ సహజమేనమ్మా! నిజమగునాకాదాఅమ్మా!

మాన — ఔను. నిజమే.

ఇందు — (మానవతి మెడతడుముచు) అమ్మా! నీమెడలో నేయాభరణములును లేవే? పెండ్లియీాడువచ్చిన కన్నెవు. ఇట్లుమొండి మెడతోనుండఁదగునా? ఇదిగో! నాయాభరణములన్నియుఁ దీసి కొనుము.

మాన — నాకక్కఱలేదు. నీనగలు నేనుదీసికొననేల?

ఇందు — అమ్మా! అమ్మ కారోగ్యముకలిగినతరువాత నీనగలు మహాలక్ష్మికిచ్చెదనని నీవుప్రతిజ్ఞ చేసినట్లు చెల్లెలిని జూచినతోడనే దానికి నానగలన్నియు నిచ్చెదనని నేనొకనిర్ణయము నెన్నిసంవత్సరములకిందటనో చేసికొంటిని. నీ మ్రొక్కు నీవుచెల్లించుకొని నాయేర్పాటు నేను జెల్లించుకొననీయకపోవుట నీకుఁదగునా? ఇఁకమాటలాడకుము. (తనయాభరణము లామెమెడను వేయును.)

మాన — నీ కాభరణములేవి?

ఇందు — అమ్మా! ఇఁక నా కాభరణములతోఁ బనిలేదు.

మాన—ఎందుచేత ?

ఇందు—నీకుఁ జెప్పెదను గాదా ? అమ్మా ! నీ కెవరిని జేసికొనవలయుననియున్నది.

మాన—నాకిప్పుడు పెండ్లితొందరయేల ?

ఇందు—అమ్మా ! ఎంతనంగనాచివే. నీకుఁ బదునాలుగేండ్లు లేవా? ఏదీ ? నా పెండ్లికే కాదా అమ్మకు నెలదప్పినది. పదునాలుగేండ్లకు దిరుగ జాలువచ్చినదని యమ్మలక్కలాశ్చర్యముగాఁ జెప్పుకొనిరి. అప్పుడు నీవు గర్భమునఁబడితివి. నేనుగాపురమునకువచ్చి పదునైదు సంవత్సరములు మొన్నటి క్షీరాబ్ధిద్వాదశికయినవి. పదునాలుగేండ్లదాని మగఁడక్కఱలేదేమి ? ఓస్ ! ముద్దరాలవు ! నాకు నీయీడుననే కాదా పెండ్లియైనది.

మాన—నా పెండ్లిమాటకేమికాని నీకునగలెందుకక్కఱలేదు!

ఇందు—నీతోఁ జెప్పెదను. ఇంకను నాకెన్నిసంగతులో నీతో సావకాశముగాఁ జెప్పవలసియున్నది. వానితొందరయిప్పుడేమియు లేదు. కాని చెల్లెలా ! నీవునన్నెఱుఁగవు కాని కనకపురరాజుభార్య నీయక్కయన్న సంగతి నీవెఱుఁగుదువు కాదా ? ఈగ్రామమునఁ బ్రాఁతహవేలీలో నీవుండియు నిట్లుచేసితివేల ?

మాన—ఇది కనకపురమని నాకెట్లు తెలియును ? నాయొ నున్న దాసికిఁదగని చెవుడు. అదిగాక చావదలఁచిన వానికిది యే యూరైననేమి యని నేను నిర్లక్ష్యముగానుంటిని. అదిగాక మాకెట్టి సంబంధమో నీవెఱుఁగుదువా ?

ఇందు—ఔనమ్మా ! కాని యీయుదయమునను నుండియును జూచినప్పుడెల్లఁ బ్రక్కకుఁదిరిగి యేడ్చుచుంటివేల ?

మాన—ఈయుదయమున్నే యిది కనకపురమని యెవ్వరో యనఁగ వింటిని.

ఇందు——ఆ ! ఆ ! నేను నీయక్కనని యీయుదయమేకని పెట్టి తివా ?

మాన——ఆ. అదిగాక మీయక్కకు బుగ్గమీఁదఁ బుట్టుమచ్చ యున్నదిసుమా ? యని మనయమ్మ యెన్నిసారులో వెఱ్ఱిధోరణిగాఁ జెప్పుచుండెడిది. అదిచూచి మఱింత బాగుగా నానవాలుపట్టితిని.

ఇందు—ఆనవాలుపట్టియు నన్నుఁ గౌఁగిలించుకొనక యింతసేపెట్లూరకుంటివే ? నీవు కఠినురాలవమ్మా !

మాన——కఠినురాలనైనయెడలఁ గడుపుదఱుఁగుకొనిపోవునక్కల యేడ్చియుందును ?

ఇందు——పోనీ ! అంత విచారించినదానవు—రవంత చెప్పలేక పోయితివా ?

మాన——అక్కా ! ఏమని చెప్పఁగలను? నీభర్త యింత ప్రమోజకత్వము చేసినాఁడని నేను జెప్పనా ? నీమనస్సు క్షోభపడదా ? కిక్కురుమనకుండఁ జావనైనఁ జచ్చెదనుగాని——

ఇందు——అమ్మా ! మానవతి యనుటకు నీవేతగుదువు. అమ్మా! చూడు. నిజముగా నాభర్తయట్లు చేయుటచేతనే మనకిట్టిమహానందము కలిగినది. అతనిలో నాకస్మికముగాఁ గలిగిన మార్పు నీ వెఱుగవు. ఎఱిగియుండిన యెడల నాతనిని నీవుకూడఁ బరిపూర్ణముగ గౌరవింతువు.

మాన——ఆమార్పేమి?

ఇందు——అతఁ డేకపత్నీవ్రతుఁడైనాఁడు. ఇదివఱకున్న యుంపుడుకత్తెలందఱకు వారి వారికిఁ గొంత ధరణమిచ్చి యీయుదయమునసే పంపివైచినాఁడు.

మాన——అక్కా ! నాకునిగుల నంతోషకరమగు వార్త చెప్పితివి ! అమ్మ చెప్పుడిది యేమెగ. నీవింక సంపూర్ణముగా షా+ మనుభ

వింతువన్న సంగతి యమ్మ చెవిని బడినయెడలఁ గొండయెక్కినట్లు సంతోషించును.

ఇందు—అమ్మా! చిరకాలము కాపురము చేసితివిగదా! ఆ సౌఖ్యమేదో తెలిసినది. ఇక నా సౌఖ్యమున కేమి కాని, నీవు సుఖపడ వలసిన దినములువచ్చినవి. నీపెండ్లిమాట యేమాయని యోజించుచున్నాను. చూడు. చెల్లెలా! నీవెవ్వరినైనఁ బ్రేమించియున్న వానినే చేసికొందువా?

మాన—నాకుఁ దెలియదు. నీయిష్టము. అమ్మయిష్టము.

ఇందు—నేనమ్మతోఁ జెప్పి యొప్పింతునులే. నీయిష్టానుసారముగా నేఁ జేయవచ్చునుగదా!

మాన—అక్కా! నన్నడుగనక్కఱ లేదు.

ఇందు—అడుగనక్కఱ లేదనకుము! అడుగవలసినయక్కఱ వచ్చినది. అందుకే అక్కే యడుగుచున్నాను. వేఁడుకొనుచున్నాను. ఇదిగో! కాళ్లుపట్టుకొని బతిమాలుకొనుచున్నాను.

మాన—నీవు నాకంటెఁ బెద్దదానవైయుండియు నిట్లు చేయఁగునా? కాళ్లువదలుము.

ఇందు—నేను వదలను. నేను బెద్దదాననుగాను. నా పెద్దతనము పోయినది. నాబుద్ధినశించినది. నేను బాపాత్మురాలను. నీవు యోగ్యురాలవు. మానవతివి. నేను నిన్నంటుటచే నీ వెక్కడ నపవిత్రవగుదువోయని భయపడుచున్నాను. నాకోరిక చెల్లింతువనుము నీకాళ్లు వదలుదును.

మాన—అలాగే వదలుము.

ఇందు—(వదలి) చెల్లెలా! నేను బహునాలు గొంప్తనుండి భర్తతో నున్నాను. కడుపుఫలింపలేదు. ఇక ఫలింపవలయునను నాసయులేదు. ఫలింపనక్కఱయులేదు. నీవుకూడ నావంటి గొడ్రాలవేయగుదువా

నీవుపుత్రవతివి కాకూడదా? నాయాశీర్వచనమున నగుదువు. అమ్మప్రతి కియుండఁగా దౌహిత్రదర్శనలాభమామెకుఁ గలిగింపుము. మావంశ ముసర్వాంశమయ్యోవను లోపములేకుండ మమ్మాఁ గటాక్షింపుము.

మాన—అక్కా! అన్నియు నెఱిఁగియుండియు నీవిట్లనుట న్యాయమా?

ఇందు—న్యాయముకావున నే చెప్పితిని. బుద్ధికలిగియో బుద్ధిలేకయో నిన్ను నాభర్త తెచ్చినాఁడు. ఈయంశము లోకమున నిదివఱకే వ్యాపించి యుండును. నీకొఱకు మరియొక సంబంధమిప్పుడు చూడఁదగలదు. లోకము మంచిది కాదు. ఈమాటవలననే నాయభిప్రాయమేదో బుద్ధిమంతురాలవగు నీవు తెలిసికొనఁగలవు. నాభర్త పూర్వవైఖరినే పాపియై చో నేమైననగుఁగాక యనినిన్నిందులకుఁ బ్రోత్సహింపను. అతఁడిప్పుడు పరిపూర్ణముగా మారినాఁడు. ఆసంగతి నామనస్సునకుఁ దెలియును

మాన—అక్కా! నాయిష్టము చూడనక్కఱలేదా?

ఇందు—ఆతఁడు నీకంటికి బాగుగాలేఁడా? నీవాతనిని జూడకుండ నట్లు చెప్పుట న్యాయమా?

మాన—చూడకపోవుటయేమి? మొన్నరాత్రి యాతఁడు మాయింటికివచ్చి నన్నిక్కడకుఁదేలేదా? నీకు నేను దోఁబుట్టినవాఁడను సుమా యని నాకాళ్లపైఁబడుట చేతనేకదా యిక్కడకువచ్చితిని. ఇప్పుడా తోఁబుట్టినవానితోడ నా పెండ్లి? చాలు!

ఇందు—అయ్యో! వెఱ్ఱిదానా? సిగ్గులేక నటకునివలెఁ దేరమీసములు మూతికంటించుకొని నిన్నుఁ జూడవచ్చిన కొజ్జాదానను నేనే!

మాన—ఆ! ఆ! అటులేల చేసితివి?

ఇందు—నీవు నాపగదానవనుకొని నిన్ను నాభర్తను సాధించుట కెన్ని నీతిమాలిన వేసములైన వేసితిని. వేయుఫలసివచ్చినది. నా

దుర్గతి. నేను పాపాత్మురాలనని యిదివఱకు నీతోఁ జెప్పియుండలేదా ఆ సంశయము లన్నియుఁ దరువాతఁ జెప్పెదను. కాని నీవు నాభర్తను జూడలేదు. ఆతఁడు సుందరుఁడు కాఁడు—కురూపి కాఁడు కొంచెము పొట్టిగా మాత్రముండును. నీవుచూడవచ్చును. కాని యొక సంగతి చెప్పెదవినుము. భర్త యెప్పుడు బుద్ధిమంతుఁడై యుండవలయును గాని సుందరు యుండనక్కఱలేదు. అమ్మా! సౌందర్యమేమి శాశ్వతమా? కర్మము చాలక యొక్కవన్నె వాడినయెడల బోసిదానరయ్యె. తలవెండ్రుకలు పండినయెడలఁ బాడుకోఁతి. కత్తితో నెగిరిపోవు వెండ్రుకలనుజూచి చెంపపెట్టుతో రాలువండ్లనుజూచి, యెండతాఁకునకు నశించు చ్ఛాయను జూచి భర్తను నిగ్గయించుకొనుట ప్రజ్ఞాహీనత కాదా? స్థిరమైన బుద్ధియే భర్తకలంకారము. అట్టిది నాభర్తకుఁ గలిగినది. కావున దల్లీ! సందేహింపకుము.

మాన—నన్నాతఁడిట్లు పరాభవించినప్పుడు నేనాతనికి భార్య నగుట నాయభిమానమునకు లోపము కాదా?

ఇందు—నిన్నాతఁడు చేసినదింకఁ బరాభవమే కాదు. పాలో నీవుంటివి. నీకొక దాసియుండెను. నీయాజ్ఞలను దీర్పఁగ ద్వారరక్షకులుండిరి. నీకు జరిగినదింతయే కాని నాభర్తను నీయూరిమున నేను పరాభవించితినో యెఱుఁగుదువా? గల్లాకొట్టులో నాతని నొక్క ద్రోయించితిని. కొట్టుతలుపు తాళము వేయించితిని. చచ్చితిని బాబయో రక్షించు భగవంతుఁడా! నాకుబుద్ధివచ్చినదే యిందుమతీ! యయ్యూరెగిరిపోవనఱచునట్లు నెత్తినోరుకొట్టుకొని యిరువదిగంటలకొక్క వరుసగా గొంతుక తడుపుకొనుటకు నీరైన నొసఁగకుండ చేయించితి- పరాభవమనునప్పుడది. ఇంత చేసితిని గావుననే నా కాతఁడు స్వాధీనుఁడయ్యెను. అయినను నాకు లేశమైన సంతోషము లేదు. అమ్మా

ఆలాగున వింతపడిచూడకుము. జరిగిన చిత్రకథయంతయుఁ గ్రమ ముగాఁ జెప్పినఁగాని నీకింతెట బోధపడదు. అదిగాక మఱియొకమాట; మగవానిని సాధించుటకు భార్యకంటెఁ దగినదెవ్వతె? ప్రక్కలోఁ బోటుపిడుగుపాటుకంటె గట్టిది. తిట్టినయెడల జక్రవర్తిమీఁదనైనఁ నభి యోగము తేవచ్చును. ఆలితన్నిన తన్నునకభియోగ మామెయొద్దనే. కాదా? భార్యశాసించిన తీర్మానమునకుఁ బైతీర్పింకఁబరలోకమునందే కదా? అక్కడ సాక్షులవూలాలుగులకు, న్యాయవాదుల నీలుగులకు నవకాశమేది? నేను నాభర్తకుఁ గష్టపడి తెప్పించిన మంచిబుద్ధిని నిలుపఁగల ప్రజ్ఞాశాలినివి కావున నాతనియందలి యభిమానముచేఁ గూడ నిన్నిట్లు ప్రార్థించుచున్నాను. ఏమంటివి?

మాన—ఇప్పుడేకదా! చెప్పితివి. ఆలోచించుకొందములే.

ఇందు—సరే మాత! ఆమాత్రిపుమాటచాలు. నీవులోనికిఁ బోయి స్నానముచేసి యీపూటనైన భోజనముచేయుము. నేను మీ బావగారితో మాటలాడివచ్చెదను.

మాన—సరే. (నిష్క్రమించును.)

ఇందు—ఎవరక్కడ!

(నేపథ్యమున) అమ్మా!

ఇందు—మాపుట్టినింటనుండివచ్చిన మాధవు నిట్లొకసారిరమ్మని చెప్పుము.

(నేపథ్యమున) చిత్తము.

ఇందు—మానాయనగారికి లేఖవ్రాయుదునా? కాక మాధ వునిచే వార్తయేపంపుదునా? మానాయనగారుమాత్రము లేఖవ్రాసి నారా? నేనేల వ్రాయవలయును?

(మాధవుఁడు ప్రవేశించును.)

ఇందు—మాధవా! రాజుగారిసిరమ్మని చెప్పుమని నీతోఁ జెప్పితినిగాదా? చెప్పితివా?

మాధ—చెప్పితినమ్మా! ఇప్పుడేవచ్చెదననినారు.

ఇందు—సరే. నీవు మాల్లిచంద్రులకు నానమస్కారములు చెప్పుము. మానవతమ్మ యిచ్చటకువచ్చి సురక్షితముగా నున్నదని చెప్పుము. దానికిఁదగిన చోటఁ బెండ్లి కుదిరినదని చెప్పుము. మీరు వెంటనే యిక్కడకు బయలుదేరి రావలసినదని చెప్పుము. మీరు రాఁగానే చెల్లెలికల్యాణము జరుగునని చెప్పుము. నీవు పుచ్చుకొనఁదగిన బహుమానము తీసికొని వేగఁబొమ్ము.

మాధ—అమ్మా! మానవతమ్మ యేమైనఁ దల్లిగారికిఁ జెప్పనేమో?

ఇందు—అది యిప్పుడు స్నానముచేయుచున్నది. తరువాత దానినడిగి తెలిసికొనియే పొమ్ము.

మాధ—అమ్మా! మఱియొకమాట! మానవతమ్మకు వంటఁజేయువాఁడు కనఁబడఁడేమి?

ఇందు—అతఁడేమో చనిపోయినాఁడఁట.

మాధ—పాపము. ఆతనికొడు కేమియుఁ దెలియక విచారించుచున్నాఁడని యడిగితిని.

(నేపథ్యమున) లోనికి రావచ్చునా?

ఇందు—రావచ్చునాయని వేఱ యడుగనేల? మాధవా? నీవు పొమ్ము. (మాధవుఁడు పోవును.)

 

(సేతు మాధవుఁడు ప్రవేశించును.)

సేతు—రావచ్చునా యని యేలయడిగితివో చెప్పనా ? పుట్టినింటినుండివచ్చిన సేవకునితోఁ బెట్టుకొను లొట్టుబట్టీయమున కంతు లేదులే.

ఇందు—ఇక్కడ మీయంతఃపురరహస్యము లన్నియుఁ గనుఁగొనిరమ్మని మాయమ్మ వాని నిక్కడకుఁ బంపలేదు. కొంపమునిఁగి వారేడ్చుచుండుటచేత నేమియుఁ దోఁచక పంపినారు. తెలిసినదా ?

సేతు—అదేమి ? అదేమి ?

ఇందు—ఏమని చెప్పుదును ? మాచెల్లెలెక్కడకో పోయినదఁట ! కానఁబడకుండనున్నదఁట !

సేతు—అయ్యయ్యో ! అక్కల జరిగినది చెప్పుమా !

ఇందు—ఏలజరిగినదా ? (మాలతిపైఁ జూడిచి) అలౌకికమైన నీయవకతవకమూలమున జరిగినది. నీవుతెచ్చిన కొత్తరాణియే మా చెల్లెలు.

సేతు—(చెవులుమూసికొని) హరి హరీ ! ఎంతపాప మొనర్చితిని ! అత్తమామలయెడల నెంతయపచారముచేసితిని ! నన్ను క్షమింపుము. (కాళ్లపైఁ బడును.)

ఇందు—లే లే ! కనులుకాల్చి కాళ్లపైఁబడిన వినియోగ మేమున్నది అయ్యయ్యో ! మాపుట్టినింటి పుట్టిముంచితివే ! ఇప్పుడేమి కావలసినది ? అయ్యయ్యో ! పెండ్లియీడుపిల్ల ! రతనాల గని—పరమ మానసంపన్న—అట్టి దానిని—ఎక్కడనో మిలిపిల్లనెత్తుకొనిపోయినట్లు లెత్తుకొనివచ్చితివే. దానిబ్రదుకెల్ల వల్లకాడుచేసితివే—అభిజాత్యసంపన్నుఁడైన క్షత్రియపుత్రుఁడెవఁడు దానిని బెండ్లాడును ? అభిజాతము నిర్వాహమాత్ర మిట్టిస్థితిలో నెవఁడు వచ్చును ! అయ్యయ్యో !

అభిమానమే సర్వమైన వర్ణములోనివారమే—మాపిల్లను మీరు చేసి కొందురా యని జిహ్వకోసిననైన ననువారము కామే—ఈదిక్కుమాలినవార్త మాతల్లిదండ్రులకుఁ దెలిసినయెడల వారు కట్టఁగట్టుకొ యగ్నిలోఁ బడుదురే. అదిగాక యాపిల్ల యెనిమిదిదినములనుండి యాహారమును వర్జించి ప్రాణపరిత్యాగమును సంకల్పించుకొనియున్నదే! మాపుట్టినిల్లిట్లు తుడిచిపెట్టుటకే దీక్షవహించితివా? భర్తపైపోయితివి కాని నిన్నేమిచేసిననైనను దోసమున్నదా?

సేతు—దోసమున్నదాయని నీవు కొంత సందేహించుచుంటివలెను? లేదనినేనుస్పష్టముగఁ జెప్పుచున్నాను లోకమెల్ల నాపక్షమున సాక్షులు. నేను బాపత్ముఁడను. నేను జేయని తప్పులేదు. నాకు రాఁదగని శిక్షలేదు. సిగ్గువచ్చినది. బుద్ధికలిగినది. నీకంటె గతిలేదని నీ కాళులపైఁబడితిని. నీయిష్టానుసారమాచరించుకొనుము.

ఇందు—అన్నియవశిష్టములు తీరినతరువాత నీకు బుద్ధివచ్చి లాభమేమి? నీవు సర్వవిధములఁ జెడితివి—మమ్ముఁ బాడుచేసితివి.

సేతు—నన్ను బాగుచేయవలయునను దీక్ష నీకిదివఱకే కలిగియుండినయెడల నేను నీచెల్లెలి నెత్తికొనివచ్చుట సిద్ధించియుండదు. కావునఁ గొంతలోపము నీదికూడ నుండిన నుండవచ్చును.

ఇందు—అయ్యయ్యో! పంచదారచిలుకను గాకి మొత్తుకొపోయినట్లు చేసితివే. చూడుము. అట్లు కాకిమొత్తుకొనిపోయిన చిలుక నేమిచేసెదము?

సేతు—అది మనకుఁ దిరుగఁ బనికిరాదు. కావున నాకాకికి దానిని వదలివైచెదము.

ఇందు—అట్లేమాటలాడక నీవు మాచెల్లెలిని జేసికొనుము. ఏమి? అట్లు సందేహించుచు మొగముఁ జిట్లించుచున్నావేమి?

సేతు—ఏమియు లేదు. అనేకత్వమువలనఁ గలిగిన కష్టము లేవో తీఱి గట్టునఁ బడితినిగదా! ఇంక నాకెందులకు? అదిగాక మఱియొక యధిక్షేపణమున్నది. ఏకపత్నీవ్రతుఁడనై యుండెదనని ప్రమాణము చేసికొనియుంటిని.

ఇందు—ఆవ్రతము నీకుఁ దప్పకుండునట్లు నేను జేసెదనుగాదా? అందును గూర్చి నీకెంతమాత్రమును సందేహమక్కఱలేదు. ఏమి? మాటలాడవు!

సేతు—ఏమున్నది? ఇప్పుడు కాదు—ఇఁకఁ బడియుండ్లకుఁ గాదా—ప్రాణము హరియని వదలువఱకు నొక్కటేమాట.

ఇందు—ఏమది?

సేతు—నీయిష్టమెట్లో యట్లే. నీయిష్టమెట్లో యట్లే. చచ్చునంతవనియైనది కావున నీసప్తాక్షరీమంత్రమే పురశ్చరణము.

ఇందు—సరే. చూడు. మాచెల్లెలు మిగుల నభిమానవతి సుమా? నావలె శాంతికలది గాదు. మిగుల భద్రముగఁ బ్రవర్తింపవలయును. జాగ్రత్త!

సేతు—ప్రక్కచూపు కట్టిపెట్టుకొన్నవానికి భద్రముగాక మఱియేమి? కాని యిద్దఱుండియు నేకపత్నీవ్రతదీక్షయని పలికితివే! ద్వైతములో నీయద్వైతమేమో నాకు బోధపడలేదు.

ఇందు—బోధపడునట్లిప్పుడే చెప్పెదను. చూడు. సుందరితో నేను న తంత్రమంతయు నీకామూలాగ్రముగాఁ దెలిపితినిగదా? ఎందుకుఁ దెలిపితినో గ్రహించితివా?

సేతు—మనకు మనకు నేవిధమైన రహస్యములుండఁ గూడదని—

ఇందు—అదియే కాదు. నేను బరమశాంతచిత్తను. నీవు నన్నెంత బాధపెట్టినను జిరకాలము సహించితిని. కోపమన్నది నేనెఱుఁ

గను. మాయయన్నది నే నెఱుఁగను. నాల్గుదినములక్రిందటివఱకు నే నసత్యమాడియెఱుఁగను. అట్టి పవిత్రచిత్తను. నీవు నాయోగ్యతను గణించితివి కావు. నన్నుఁ గోటనుండి వెడలఁగొట్టఁబ్రయత్నించితివి. తుట్టతుదకుఁ బ్రాణము విసిగి నేను నిన్ను శిక్షించుటకు సంకల్పింకొంటిని. మాయలో దిగితిని. దొంగవేసములు వేసితిని. అనేకములగు నసత్యములాడితిని. నిన్ను గాదిలో బంధించితిని. మొఱ్ఱోయ యేడ్పించితిని. భార్యనైన నేనిట్టి ద్రోహము నీయెడఁ జేయవలసినది కాదు. పరమపాపాత్మురాలనైతిని. వెన్నముద్దను ఫిరంగిగుండును నీ చేసితివి. నేను జేసిన దుష్టవ్యాపారమునకై నాకిప్పుడు పశ్చాత్తాపము కలిగినది. తప్పు బాహాటముగ నొప్పుకొనుటయే పశ్చాత్తాపమునకు ముఖ్యలక్షణము. కావున నీతో నీవృత్తాంతమంతయుఁ జెప్పి క్షమింపుమని వేడుకొంటిని. ఈచరిత్రము ప్రమాదవశమున సుఖపర్యవసన్నమైనదిగాని సంఘమరణసహితమై కష్టాంతము కాఁదగినది. కష్టాంతమే యగునెడలఁ బాపశాంతికిఁ బశ్చాత్తాపమైన లేకుండ దుర్గతులపాలు గావలసియుందుము. దైవకటాక్షమున నిప్పటివఱకు ఘటనములు మిగిలినవి. నీయెడలఁ జేసిన తప్పొప్పుకొనుటచేత నిన్నుఁగూర్చిమాత్రము నాహృదయము నిష్కల్మషమైనది. కాని——

సీత.—అయ్యయ్యో! నీవిట్లనుట తగునా? నీవు మహా- ణ- కార్య మాచరించితివి.

" గీ॥ ప్రభువుచే బాగుపడనట్టి పాపికలఁడు
ప్రజలచే బాగుపడనట్టి పాపికలఁడు
ఎట్టి పాపాత్ముఁడైనను గట్టుకొన్న
భార్యచే బాగుపడనట్టి భర్త లేఁడు. "

అని మాకుంటిపంతులుగారు బాల్యములోఁ జెప్పిన పద్యము సంపూర్ణనిదర్శనము నాయెడలనే కనిపట్టితిని.

ఇందు—నీవు నామాట కడ్డురాకుము. నీపద్యము లింక గట్టి ము. నీయెడలమాత్రమే నాహృదయము నిష్కల్మషమైనది. కాని నముగూర్చిమాత్రము నాహృదయమింక సకల్మషముగనేయున్నది. ాడిన యసత్యములకు—నేను జేయఁగూడనిచేష్టలకు—నేను దలఁప ని తలఁపులకు—నన్నాపరమాత్ముఁ డింతట క్షమింపఁడు. కష్టపడి, నామము స్మరించి, వైరాగ్యవృత్తిఁబూని, సంసారపరిత్యాగ ను జేసి—

సేతు—అయ్యయ్యో! అట్లనుచుంటి వేల?

ఇందు—అ ! నామాట కడ్డురాకుము. ఆత్మపరిశుద్ధి నశిం జేసికొని భర్తతో సుఖమొందిన యాఁడుదానికంటె నధమవస్తువు పంచముననున్నదా? నాకుఁ గావలసినది భర్తృసుఖమా? భక్తి ఖమా? ఇఁక నాకు నీవక్కఱలేదు. నేనిప్పుడే సన్యాసినినయ్యెదను.

సేతు—అయ్యయ్యో! వలదు. వలదు.

ఇందు—నామాట కడ్డురావలదని చెప్పలేదా?

సేతు—అటులనుచుండ నేనేమిచేయవలసినది?

—నీయిష్టమెట్లో యట్లే యను సప్తాక్షరీమంత్రమును ంపుము. ఇదిగో! వెనుక నేను జాగ్రత్తపఱచుకొనిన కాషాయము.

(లుంగిని దొడిగికొనును.)

సేతు—అయ్యయ్యో! అయ్యయ్యో! మంచియో చెడ్డయో యాఁడుదానికి బుద్ధి పూర్ణముగాఁ బు నతరువాత నాఁపుట బ్రహ్మ రమగునా? కానీ! నాకర్మమిట్లున్నది.

ఇందు—విచారింపకుము. దివ్యమంగళవిగ్రహమైన భార్య సంపాదించుకొంటివి. ద్వైతములో నద్వైతమెట్లని యిప్పు డధిక్షేపి తివే. నాయాశ్రిమస్వీకారముతో ద్వైతము వదలినదికదా? నిలిచి యద్వైతమే కాదా? ఇంక నీయేకపత్నీవ్రతమునకు భంగమేదీ! కలిగి సుఖపడి వంశవృద్ధిచేసికొనుము. ఇంక నీతోఁ జెప్పవలసినమా లివియే. ఓ పరాత్పరుఁడా! రక్షింపుము.

బిలహరి—ఏక.

పరమేశ! ఈశ్వరా! భవబంధనాశనా!
ప్రణతార్తి హారభక్తపరిపోషణకుశలా!
బహుదయా పరిపాల! పాపవిధ్వంసనా! "పర-శ"
ఇక్కడన కకక్కడన కెక్కడనుగాంచినను
అక్కజంబుగ నుందువనుచుఁ బెద్దలుపల్క
మ్రొక్కి మ్రొక్కి కనులు పొడుచుకొనిచూచినను
ఎక్కడను గానఁబడవె నయ్యా! "పరమేశ"

సేతు—అయ్యయ్యో! ఈకొ...పాట ల?

ఇందు—క్రొత్తపాటలు నీకిష్టముకానియెడల మనపాతపా యే పాడెదను.

ధరణి యీతిబాధలులేక తనరుఁగాక
ప్రజల యన్యోన్య వైరములణఁగు ...
కవితరాజపోషణమునఁ గ్రాలు గాక
నీతిపాలనమున రాజు నెగడుఁగాక!

సే—తథాస్తు.

ఇతి పంచమాంకము.